




# సంపూర్ణ పోషకాహారంలో వుండవలసినవన్నీ కలిసివున్న రుచికరమైన పదార్థం

# సిరిలాక్®

## ఇన్‌స్టెంట్ వీట్ మిల్క్ సీరియల్

దీనిని తయారు చేయడం చాలా సులభం.
—దీనితో ముందుగా మరగబెట్టిన గోరువెచ్చని నీరు చేర్చండి.


ముందుగా మరగబెట్టిన నీటితో సెరిలాక్ చేర్చండి


బాగా కలపండి


వెంటనే యిచ్చేందుకు తయారు

ఇవ్వగలిగినంత కాలం మీ పాపకి చనుపాలు యివ్వండి—మీరు యివ్వగలిగిన మంచి ఆహారం అదే. 4 నెలల ప్రాయం వచ్చేసరికి పాపకి ఎక్కువగా పోషక పదార్థాలు కావాలి. ఘన పదార్థాలు తీసుకోడానికీ పాప సిద్ధంగా వుంటుంది. సిరిలాక్ యివ్వడం వలన, పాలు యివ్వడం మానకుండా పాప ఆహారంలో ఘన పదార్థాలు ప్రవేశ పెట్టడం గురించి మీ డాక్టర్‌ని సంప్రదించండి.

మీ పాపకి సరిఅయిన పాళ్లలో పోషక పదార్థాలు అందించడానికి సిరిలాక్‌లో గోధుమ పిండి, పూర్తి మీగడ పాలు మరియు చక్కెర ఉన్నాయి. పిండి పదార్థాలు మరియు క్రొవ్వు పదార్థాలు శక్తి నివ్వడానికి, మాంసకృత్తులు పెరుగుదలకి, విటమిన్లు మరియు ఖనిజాల లోపాల నుండి రక్షణ కలిగించడానికి దీనిలో ఉన్నాయి. సిరిలాక్—మీ పాప బాగుగా, ఆరోగ్యంగా పెరగడానికి.

**సిరిలాక్**–పాలు వుండనే వున్నాయి

SAA/FSL/C/2258 TEL NESTLÉ




### వినాయకచవితి సంచిక

టి.వి.ఎస్.మూర్తి చిత్రించిన నాట్యగణపతి చాలా బాగుంది. ఈ సంచికలో ప్రచురించినఆరుకథలు మాకెంతో తృప్తి నిచ్చాయి. ముఖ్యంగా కుమారి ఎ. వి. శేషారత్నంగారి అద్దె కివ్వబడును, ప్రఫుల్లచంద్రగారి వినయకవ్రత కథ, అమాయకుడు అనే మూడు కథలు చాలా బాగున్నాయి. కార్టూన్ల విషయంలో యింకా శ్రద్ధతీసుకునుంటే బాగుండేది. పి. కృష్ణమూర్తిగారి వ్యాసం 'విఘ్నరాజా వినాయకునిగాథలు' చదివాక వినాయకునిగూర్చిమరింతతెలుసుకున్నాము. బువుద్ధులు కూడా వినాయకుని కొలుస్తారని తెలుసుకుని అచ్చెరు వొందాము.

'ధర్మో రక్షతి రక్షితః' సీరియల్‌లో రచయిత (పేరు తెలుపబడలేదు) 'శ్రీ రావ్ పరుగు పరుగున అందుకున్నాడు,. ఒడ్డును వదల బోతున్న పడవను కాలు నీళ్లలో పడింది. మోకాలి వరకు బంక అంటుకుంది. విదిలించుకుని పడవలో అడుగుపెట్టాడు' అని రాసి, శ్రీ రావ్ బురదలో పడటం వదిలించుకోవటం అనే అంశాలద్వారా అతను చెడు స్నేహాలను వదిలించుకుని సన్మార్గ జీవన నావలో అడుగు పెట్టాడని చాలా బాగా తెలియజేసారు. రచయితని మెచ్చుకోకుండా వుండలేక పోతున్నాం.

శేషు, ప్రసూన (గుంటూరు)

### న్యూ ఢిల్లీ లేఖ

'ఇండియా టు డే', ''ఆర్గనైజర్'' పత్రికలకు వ్రాసే డా. జయ్ దుబాషి గారిని ఆంధ్రపత్రికకు ''న్యూ ఢిల్లీ లేఖ'' వ్రాసేందుకు నియమించడం హర్షించదగ్గ విషయం.సరికొత్తతరహాలో వార్తలను సేకరించడం, వ్రాయడం, ''ఇండియా టు డే'' విలేఖరుల ఆనవాయితీ. అదే పంథాలో డా. జయ్ దుబాషిగారు ''న్యూఢిల్లీ లేఖ'' ఢిల్లీకే పరిమితం కానివ్వక ప్రతి రోజూ వార్తలు అందించే వార్తాపత్రికలలో రాని విషయాలను కూడా వారం వారం ఆంధ్రపత్రిక పాటకులకు అందచేస్తారనడంలో సందేహం లేదు.

ఢిల్లీలోని పాలకులమీద విసిరే విసుర్లు, రసధాయక పూరిత వ్యంగం,చురుక్కుమనే చురకలు,ఇక పాటకులు ఆస్వాదం చేసేందుకు అనువుగా, డా. జయ్ దుబాషిగారి పూర్తి వ్యాసాలను స్వేచ్ఛానువాదంలో గాక భావానువాదంతో ప్రచురిస్తారని ఆశిస్తూ....

కె. పెంచలయ్య (నెల్లూరు)

* * *

నేను ఆంధ్రసచిత్ర వారపత్రిక చదివేటప్పుడు ముందుగా పూమెన్‌గారి లోకంపోకడ కార్టున్ను చూడటం నాకు అలవాటుగా ఉండేది. యిటీవల నుంచి మీరు ప్రచురిస్తున్న ''న్యూఢిల్లీ లేఖ'' చదివినప్పటినుంచి ముందుగా అదే చదువవలెనని ఉత్సాహముగా యున్నది. 17—9—82 సంచికలో న్యూఢిల్లీలేఖ రాజధానిలో రాష్ట్ర రాయబారి కార్యాలయాలు చాల బాగుంది. లేఖ పంపుతున్న డా. జయదుబాషిగార్కి ధన్యవాదములు.

దీవి శేషాచార్యులు (జమ్మిగొల్వేపల్లి)



వినాయకచవితి సంచికతో ప్రారంభించబడిన 'న్యూఢిల్లీ లేఖ' చాలా కాలం తరువాత మమ్మల్ని ఎంతగానో ఆకర్షించింది.

సి. భవాని (విస్సాకోడేరు)

### న్యాయం కనబడుట లేదు

న్యాయం కనబడుట లేదు అను కథ చాల బాగుంది.

సాయల్ల మల్లేశం (మెటుపల్లి)

### పసుపుతాడు?

3—9—1982 సంచికలో ప్రచురింపబడ్డ డాక్టర్ గుమ్మనూరు రమేష్‌బాబు ''అంతే లేదా!'' అన్న కవితను చదివిం తరువాత ఈ ఉత్తరం వ్రాయకుండా వుండలేక పోతున్నాను. ఈ దేశం సంస్కృతిని, సాంప్రదాయాన్ని గౌరవించే ఒక పాటకునిగ ఈ ఉత్తరం వ్రాస్తున్నాను.

డాక్టర్ గుమ్మనూరు రమేష్‌బాబు ''పసుపు తాడు పశువు మనిషికి కడుతోందని కచ్చితంగ చెప్పొచ్చు'' అని వ్రాశారు.

ముక్కుతాడు కట్టి మనిషి పశువును తనదాన్ని చేసుకొంటాడు. పసుపుతాడు కట్టి మనిషి ఒక ఆడదాన్ని తన స్వంతం చేసుకొంటాడు. బాబు గారికి మనిషి పశువుగ కన్పించవచ్చు.

ఇలాంటి కవితలు ఎన్ని చెప్పినను ఈ దేశంలో పసుపుతాడుకు ఇంకా విలువున్నదని మరిచిపోకండి డాక్టర్ మహాశయా! ఈ దేశంలో అన్నిటికన్నా అతి పవిత్రంగా చూడబడుచున్నది పసుపుతాడని గుర్తించుకోండి. ఇలాంటి సామాజిక విలువలే మరి కొన్ని ఈ దేశాన్ని ఇంకా కాపాడుతున్నాయని తెలుసుకుంటే అంతే చాలు.

ఆవుల రమణారెడ్డి (జమ్మలమడుగు)

### సవరణ

27—8—82 ఆంధ్రసచిత్ర వారపత్రికలో ప్రచురింపబడిన నా గేయానికి మకుటం 'యత్రైతాస్తు న పూజ్యన్తే' అని వుండాలి

పైడిపాల (అమలాపురం)

### బాగాలేవు

జయప్రద ముఖచిత్రంతో వెలువడిన సంచికలో కథలు ఏవీ బాగాలేదు. కార్టూన్లు చాలా బాగున్నాయి. సీరియల్స్ చక్కని పంథాలో నడుస్తున్నాయి.

పాలకాయల శేషగిరిరావు (గుంటూరు)

### నచ్చాయి

''నేటికథ రేపటి ముగింపు,'', ''తెలుపు—నలుపు'' కథలు మా కెంతగానో నచ్చాయి.

వత్సవాయి శేషవర్మ, సాగర్ (చినగమ్ములూరు)

### నచ్చిన కథ

'కుక్కర్ సింహం — గ్రామ సింహం' కథ, మాకెంతో నచ్చింది.

కె. గంగాధరరెడ్డి, ఇతరులు (పాతవాళ్లాయపాలెం)

(66 వ పేజీ చూడండి)

ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
[1938 – 1972]
శుక్రవారం : 15–10–'82
దుందుభినామ సం. ఆశ్వీయుజ బ. త్రయోద
సంపుటము 75 . సంచిక 7
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
*
ఆరు మాసాల చందా రు. 42–90
పోస్ట్‌లో ఏడాది చందా రు. 85–80
విడి ప్రతి వెల రు. 1–50
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ–520 003

# విషయానుక్రమణిక



— లోకం పోకడ — డూమెన్ —



# ఎమర్జెన్సీలో దాసోహమన్న జర్నలిస్టులు

రాజకీయ వాదులకీ పత్రికా రచయితలకీ పడదు కుక్కలకీ పిల్లులకీ పడనట్లే ఇదీను. కుక్కకి బలం ఎక్కువ. కాని, పిల్లికి పుట్టెడు బుద్ధులు. కుక్కని ఏడిపించుకు తినగలదు. జగన్నాథమిశ్రాకి పిచ్చి పట్టిందని పిస్తుంది ఆయన మాటలు వింటే (చదివితే). అనిపించటం ఏమిటి, నిజంగానే ఆయనకి పిచ్చి పట్టింది కూడా. ఎందుకు పిచ్చి పట్టింది ? స్వయంగా పట్టిందా, లేకపోతే పత్రికలవాళ్ళు పిచ్చెక్కించారా ?

పత్రికా రచయితల సహాయంతో కొందరు రాజకీయవాదులు పయికి వెళ్ళారు వెళ్ళిన తరువాత ఎక్కిన నిచ్చెననే తన్నేద్దామను కుంటారు. ఇది మానవ స్వభావం. అయితే, రాజకీయవాదులు తన్నవలసిన మనుషులు జర్నలిస్టులు కారు. ఎందుకంటే, నిచ్చెన




పట్టుకున్నవారిలో ఎక్కువమంది వాటిని పట్టుకునే నుంచుని ఉన్నారు.

నిచ్చెన పట్టుకున్నవారు అత్యవసర పరిస్థితిలో శ్రీమతి గాంధీతో సహకరించిన వారే. అలాంటివారు ఇప్పుడు జగన్నాథమిశ్రా దుర్మార్గాన్ని గురించి మాటలాడుతున్నారు. ఆయన ఎలాగ డబ్బులు చేసుకుంటున్నారో చెబుతున్నారు, బాగానే ఉంది కాని శ్రీమతి గాంధీ అత్యవసర పరిస్థితికి ముందూ, అత్యవసరపరిస్థితిలో చెయ్యనిది జగన్నాథమిశ్రా మాత్రం ఏమిచేశారు ? పాట్నాలో కొందరు పత్రికారచయితలని పోలీసువారు కొట్టారు; ఏడుసంవత్సరాలకింద శ్రీమతి గాంధీ ఆదేశాల ప్రకారం అదే నగరంలో జయప్రకాశనారాయణని పోలీసువారు కొట్టలేదూ ? అప్పటిలో కొందరు జర్నలిస్టులు ఢిల్లీ ప్రెస్‌క్లబ్‌లో కూర్చుని బీర్ సేవిస్తూ "జె. పి." మీద శ్రీమతి గాంధీ ఎంత ధైర్యంగా చర్యలు తీసుకున్నారు, అని పొగిడారు. ఈ జర్నలిస్టులే ప్రెస్‌క్లబ్‌కి ఇంకా వస్తున్నారు. కాని వారి మాటల జోరు తగ్గింది జర్నలిజమ్ పేరు చెడగొట్టేవారు వీరే. చెడగొట్టినా వారు ఎక్కడికీ పోరుకదా ? లోపలి శత్రువు బయటి శత్రువు కన్నా ప్రమాదం కదా ?

ఎమర్జెన్సీ వచ్చిన కొంతకాలం తరువాత పి. సి. గాంధీ అనే ఒక ప్రెస్‌క్లబ్ అధికారి సభ్యులకి ఒక సర్క్యులర్ పంపారు. (ఈయన ఇప్పుడు ఢిల్లీ కరెంటు సరఫరాని అనుశీలించే వార్తాంశాలు తయారు చేస్తున్నారు) ఎవరు ఏ పత్రికకి పని చేస్తున్నారో తెలుపమని ఆ సర్క్యులర్‌లో ఆయన కోరారు అధికారంలో ఉన్నవారికి ఇష్టంలేని పాత్రికేయులని బయటికి పంపించటమే వారి ధ్యేయం. [కొన్ని పత్రికల వారికి పని లేకుండా చేసింది వీరే కదా ?] ఆ పత్రికలనే మూయించి వేశారు అప్పటి "డబ్బా నియంతలు" అంటే, ప్రభుత్వ సమాచారశాఖ అధికారులన్నమాట. పి. సి. గాంధీ, తదితరులు ఎందుకింత శ్రమపడి ఈ అధికారులకి తోడుపడ్డారు ? ప్రెస్‌క్లబ్ అధికారులు పయినుంచి వచ్చే వత్తిడిని ఎదుర్కోవాలి కదా ? వారితో సహకరించి తమ తోటివారిమీద చాడీలు చెప్పటం ఏమిటి? కాని గాంధీ లాంటి జర్నలిస్టులు తమ తోటి వారి మీద చాడీలు చెప్పటమే కాదు ప్రభుత్వం వారి ముందు పెంపుడు కుక్కల లాగ తోకాడించుకుంటూ తిరిగారు కదా ? పి సి. గాంధీ పనిచేసే పత్రిక "టయిమ్స్ ఆఫ్ ఇండియా". ఇది ప్రభుత్వం వారి అధీనంలో ఉన్న పత్రికలాగ ఉంటుంది చదివితే ! ఎమర్జెన్సీలో ఆ పత్రిక సంపాదకుడుగా శామ్‌లాల్ అనే ఆయన ఉండేవారు. ఆయన అప్పటిలో ఏ పారిస్ నగరంలోనో అచ్చు అయిన పుస్తకాలని గురించి చక్కటి సమీక్షలు రాసేవారు. అలాంటివి ఇంకా రాస్తున్నారేమో కూడా. ఈ శామ్‌లాలే తమ పత్రిక టయిమ్స్ ఆఫ్ ఇండియాలో పనిచేసే సుందర్ రాజన్‌ని అత్యవసర పరిస్థితిలో అరెస్టుచేస్తే కొంచెంకూడా సాయపడలేదు. శామ్‌లాల్ ఎప్పుడు మిశ్రా మీద ఒక గొప్ప వ్యాసం రాస్తారా అని చూస్తున్నాను - గిరిలాల్ జెయిన్ అటువంటి వ్యాసమే వస్తే దానిని తమ పత్రిక యొక్క కార్టూన్‌ల పేజీలో వేస్తారని నా ఆశ. ఆ పత్రికలో నేను చదివే పేజి అదొక్కటే

జగన్నాథమిశ్రా పిచ్చివాడేమీకాదు. ఆయన తన వ్యాపారాన్ని బాగా నేర్చుకున్నారు. భారతదేశంలో రాజకీయాలు టాటా, బిర్లాల వ్యాపారంకన్నా పెద్ద వ్యాపారం ఆయన ఈ విద్య నేర్చుకున్నది తమ సోదరుడు కీ శే. లలిత్ నారాయణ పాదాల వద్ద. ఈయన న్యూఢిల్లీ జర్నలిస్టులని బాగా మేపేవారు. పెద్ద హోటళ్ళేమిటి ? కొత్త వస్త్రాలు దానం ఏమిటి ? గొప్ప పార్టీలు ఏమిటి ? మిశ్రా కొందరు జర్నలిస్టులకి సూటు బట్టలు ఇచ్చేవారు. వాటిని పుచ్చుకుని ఆ జర్నలిస్టులు మిశ్రా స్తుతులు చేసేవారు. వీరిలో ఆర్థిక నిపుణులుగా చెలామణీ అయ్యే వారు కొందరు ఉన్నారు వారు బీహారు సాధించిన అభివృద్ధిని ఉదారంగా పొగిడేవారు తమ పత్రికలలో. మిశ్రాకి వాణిజ్యశాఖ వుండేది. దానిమీద ఆయన చేసిన డబ్బుకి అంతులేదు. రిజర్వుబ్యాంకు కన్నా ఎక్కువ విదేశ ద్రవ్యం ఈయనకి ఉండేదని అప్పటిలో అనుకునేవారు ! పాపం ఆయన పతనానికి అదే కారణం అయింది. ఆయన యజమానులకి ఈ సంగతి తెలిసింది. ఆయన ఉద్యోగమూ, ప్రాణమూ రెండూ పోయాయి.

భారతదేశంలో రాజకీయాలని గురించి వ్యాఖ్యలు చేసేవారు నెలకొల్పిన సంస్థ

# న్యూఢిల్లీ లేఖ

దాయాలు ఇప్పటివికావు తిలక్, గాంధీ, నెహ్రూ – వీరందరూ పత్రికలని పెట్టిన సంపాదకులే. లోకమాన్యుడు 500 రూపాయల పెట్టుబడితో తన పత్రిక ''కేసరి'' ని నెలకొల్పాడు. ఒక్కొక్కసారి ఆయన సంపాదకీయాలు, సమావేశాలని వర్ణించే వార్తలు పత్రిక అంతా నిండిపోయేవి. గాంధీగారి '' యంగ్ ఇండియా '' (అనంతరం ''హరిజన్'') సంగతి వేరు. ఇది తిలక్ పత్రిక లాగ వ్యాపార పద్ధతి మీద నడిచేది కాదు. దీనికి బిర్లా, బజాజులు డబ్బు ఇచ్చి కాపాడుతూ ఉండేవారు. నెహ్రూ స్థాపించిన ''నేషనల్ హెరాల్డ్'' కి ఎంత పెట్టుబడి ఉండేది ? అతిస్వల్పం ! కాని, ఇప్పుడు దాని పరిస్థితి వేరు. నేషనల్ హెరాల్డ్‌ని నడిపే మీటలు ప్రధానమంత్రి కార్యాలయంలో ఉన్నాయి. ''కేసరి'' ని నడిపే వ్యక్తి తిలక్ మనుమడు. ఈయన అంతూలే మంత్రివర్గంలో ఉండేవారు. ''హరిజన్'' మూతపడింది. ''నేషనల్ హెరాల్డ్'' ని నడిపే మనిషి నెహ్రూ ఇంట్లో పద్దులు రాసే గుమాస్తా. ఈ పత్రికకి ఎంత కీర్తి ఉందంటే సెప్టెంబరు మూడవతేదీ జరిగిన సమ్మె నాడు మా ఇంట్లో పత్రికలు పడేసే కుర్రవాడు ''దీనిని ఎవరూ చదవరు'' అని దానిని వెయ్యలేదు.

పత్రికా రచయితలు స్వతంత్రులయితే వారు రాసే పత్రికలూ స్వతంత్రంగా ఉంటాయి. ప్రతిఒక్క నిజాయితీ కల పత్రికా రచయితకీ ఇద్దరుముగ్గురు అమ్ముడుపోయే జర్నలిస్టులు ఉంటారు. కొందరి వెల సూటు బట్ట, మరికొందరి వెల విదేశయాత్ర, ఇంకొందరి వెల వేరే ఉంటుంది. ఇలాంటి వారికి పత్రికలలో ఉద్యోగం ఏ దర్జీపని వంటిదో లేదా వెల్లవేసే పని వంటిదో. అధికారాన్ని ఎదిరించే వారే పత్రికలకి వెన్నెముకవంటి వారు తిలక్ రాసిన ఒక సంపాదకీయానికి శిక్షగా దొరతనంవారు ఆయనకి బర్మాలోని మాండలేలో ఏకాంతవాస కారాగారా వాసం విధించారు.

ఇటువంటి వారి పని పట్టాలని మిశా ఆశ. శామ్‌లాల్ పని పట్టాలని ఆయన కోరుకోరు. ఆయన ఆశ అడియాస అవుతుందనుకోండి. అది వేరే సంగతి. ★

# పరివర్తన




రాజ్యలక్ష్మీ కొలాస్కర్

ఎయిర్‌పోర్టు సందడిగా కోలాహలంగా వుంది ఎక్కడ చూసినా పరిమళాలు విరజిమ్ముతూ ఆత్మీయులకి స్వాగతం పలకటానికి ఎదురు చూస్తున్న పూల దండలు, అందమైన ఆడపిల్లలు, అటూ యిటూ పరుగులు తీస్తున్న పిల్లలు.

ఒంటరిగా ఒకమూల సోఫాలో కూర్చున్న శైలజకి ఇవేమీ కన్పించటం లేదు. ఆమెకి క్షణక్షణం జయలక్ష్మి, ఆమె భర్త, ఇద్దరు పిల్లలు కళ్లముందు మెదుల్తున్నారు. ఆ బొమ్మల్ని తుడిచెయ్యడానికా అన్నట్లు కళ్ళు గట్టిగా చేత్తో మూసుకుంది. అవి కదలననడంతో ఆవేదనగా సోఫాలో వెనక్కి కూలబడింది.

అలా నిమిషాలే గడిచాయో గంటలే గడిచాయో! మైక్‌లో బొంబే ఫ్లయిట్ అరైవల్ ప్రకటన విన్పించింది. అందరితో పాటు తనూ లేచి గేటు దగ్గరికి వెళ్ళింది. విమానంలోంచి ప్రయాణీకులు ఒక్కొక్కళ్ళే దిగుతున్నారు. బ్రీఫ్ కేసుతో వేగంగా నడిచి వస్తున్న భర్త రమేష్‌ని చూడగానే శైలజ తాత్కాలికంగా తన బాధ మరచిపోయి ఆనందంగా ముందుకెళ్లింది. లాంజ్‌లోకి వస్తూనే ఆమె చెయ్యి గట్టిగా పట్టుకున్నాడు రమేష్.

"శైలూ బాగున్నావా?" ఆత్రుతగా అడిగాడు.

"ఊఁ" తలూపింది.

"కాన్ఫరెన్సు బాగా జరిగిందా" ఈసారి అడగటం శైలజ వంతు.

"చాలా! నా పేపరు అక్కడ ప్రెజెంట్ చేసిన అన్ని పేపర్సుకంటే బాగుందని అందరు అన్నారు. దానిపై చాలా డిస్కషను జరిగింది. అదంతా నీకు దారిలో చెప్తాను. పద లగేజి వచ్చిందేమో చూద్దాము. అవునూ!

నువ్వేమిటి అదోలా వున్నావు? ఒంట్లో బాగా లేదా ?"

"అదేంలేదు! పదండి."

కారు డ్రైవ్‌చేస్తూ రమేష్ ఉత్సాహంగా ఏమేమో చెప్తున్నాడు స్విట్జర్లండ్ ఎంత అందంగా ఉంటుందో! కాన్ఫరెన్స్‌కి వచ్చిన డెలిగేట్స్ గురించి, వాళ్ళు ఒక్కొక్కళ్ళు ప్రెజెంట్‌చేసిన ఆధునికమైన వైద్యవిధానాలు ఆపరేషన్లు వగైరా! శైలజకి సగం సగమే విన్పిస్తున్నాయి.

కారు యింటిముందు ఆగింది. పనివాడు వచ్చి సూట్‌కేసులు తీసుకున్నాడు. మెట్లెక్కుతూ అడిగాడు రమేష్ "ప్రాక్టీసెలావుంది శైలూ! ఉక్కిరిబిక్కిరైపోయావా? ఏమైనా ఇంటరెస్టింగ్ కేసులు వచ్చాయా?"

"అంతామామూలే! ముందు భోంచేద్దాం రండి! తరువాత తీరిగ్గా మాట్లాడుకోవచ్చు" డైనింగ్ రూములోకి దారి తీయబోతున్న శైలజని పట్టి తనవైపుకు తిప్పుకున్నాడు రమేష్.

"శైలూ! పదిహేను రోజుల తరువాత కలుసుకున్న నాకు నువ్విచ్చే స్వాగతం ఇలాగా? ఏమైంది? ఎందుకిలా వున్నావు? వచ్చినదగ్గర్నుంచి చూస్తున్నాను. నువ్వు నా శైలువేనా అని అనుమానం కల్గుతోంది."

భోరుమని ఏడ్వాలన్పించి శైలజ బలవంతాన నిగ్రహించుకుని చిరునవ్వు ముఖంపైకి తెచ్చుకుంది.

"ఏంలేదండీ! ఈ రోజంతా కొంచెం తలనెప్పిగా వుంది. అంతే!" అంటూ వెళ్ళిపోయింది.

భోంచేస్తున్నంతసేపూ రమేష్ శైలజ వైపే చూస్తూ కూర్చున్నాడు. ఎలాగో అయిందన్పించి లేచారు.

బెడ్‌రూమ్‌లోకి రాగానే పక్కమీద వాలిపోయింది శైలజ. రమేష్‌పడుకోగానే అతనికి దగ్గరగా జరిగి అతని గుండెల్లో తల దాచుకుంది రమేష్‌కి అయోమయంగా వుంది. ఎంతో ఉత్సాహంగా ఉండే తన శైలుకిరోజే మయిందీ? తను వెళ్ళేటప్పుడు చీరెలు, పర్‌ఫ్యూమ్స్ జ్యూవెల్స్ ఇంకా ఏమేమిటోతెమ్మని వాగ్దానం కూడా చేయించుకుంది. ఇప్పుడు కనీసం వాటి మాటైనా ఎత్తటం లేదు. ఎంత ఆలోచించినా అంతుచిక్కటం లేదు. సరే కొంతసేపాగితే తనే చెప్తుంది అనుకుంటూ నిద్రకుపక్రమించాడు.

# పరివర్తన

శైలజ మనసు సుడిగుండంలా వుంది. పదేపదే 'మెడిసిన్ ఎందుకు చదివానా!' అని తన్ని తను తిట్టుకుంటుంది. అంతలోనే "తండ్రి బలవంతంపైన" అని సర్దుకుటుంది. "నీ బుద్ధేమయింది" అని అంతరాత్మ ప్రశ్నిస్తుంది. శైలజకి తనచదువంతా క్రమంగా గుర్తు రాసాగింది.

శైలజ చిన్న బిజినెస్ మాగ్నెట్,లక్షాధికారి అయిన తండ్రికి, వ్యక్తిత్వంలేని తల్లికి ఒక్కగా నొక్క కూతురు విపరీతయిన గారాబం. చదువసలు ఏమాత్రం అంటలేదు మన విద్యా విధానం పుణ్యమా అని పదవ

**మూల సూత్రం**

గులాబీలు వికసించినా
గడ్డిపూలు కనువిచ్చినా!
మొలిచే మొక్కల వేల ఒక్కటే!
గొప్పతనం గుబాళించినా
పేదతనం పిసాళించినా
ప్రేమ మోసులెత్తు గుండె ఒక్కటే!
పేద గొప్పల వారధి
ప్రేమ ఒక్కటే!
కాదనుకుంటే గుండెలనిండా
కటిక చీకటే!

— పి. టి. బాబు

తరగతి వరకూ నిర్విఘ్నంగా పాసయింది. యస్. యస్. యల్. సి. మాత్రం అతి కష్టంమీద అత్తెసరు మార్కులతో పాసయింది. కాలేజీ ప్రిన్సిపాలుకి చేతులు దండిగా తడిచేసి పి. యు. సి. సైన్సు గ్రూపులో జాయిన్ చేశాడు తండ్రి. ఫిజిక్సు, కెమిస్ట్రీలకి ఒక ట్యూషను, బోటనీ జువాలజీలకి ఒక ట్యూషను. రోజూ తండ్రి ఎలాగోలా వీలు చేసుకుని కొంచెంసేపు కూతురుకి బంగారు భవిష్యత్తును అందమైన రంగుల్లో చిత్రించే వారు. "చూడు శైలుతల్లీ! నువ్వు కొంచెం కష్టపడి సెకండు క్లాసు తెచ్చుకుంటే నిన్ను మెడిసిన్ చదివిస్తాను. అసలే అందమైన నా చిట్టితల్లి తెల్లకోటువేసుకుని స్టెత్ వేసుకుంటే ఇంకెంత అందంగా వుంటుందో! మెడిసిన్ అయ్యాక నీకు డాక్టరుని భర్తగా తెచ్చి ఇంద్ర భవనంలాంటి నర్సింగ్‌హోమ్ కట్టించి ఇస్తాను. అటు రెండు చేతులా డబ్బు ఇటు సంఘంలో హోదా" అంటూ.

అయినా అన్ని ప్రాక్టికల్స్‌లోనూ ఫుల్ మార్కులు వేయించితేగాని సెకండు కాస్ మార్కులు రాలేదు శైలజకి ఎందు కొసా యి? సినిమాలు, పిక్నిక్కులు, తెలుగు నవలలు, స్నేహితులతో కబుర్లు! టైము ఎన్నింటికని సరిపోతుంది?

దండిగా డొనేషను కట్టి మెడికల్ కాలేజీలో జాయినయింది అప్పట్నుంచి ఆరు సంవత్సరాలు సుందరమయిన స్వప్నంలాగ గడిచిపోయాయి అందమయిన చీరెలు, సినిమాలు, షికార్లు, కాలేజీ బ్యూటీగా ఎన్నికవటం! ఎటు చూసినా తన్నారాధించే అబ్బాయిలు! చదువుకోవాలనే బాధ అసలే లేదు సంవత్సరం తరువాత సంవత్సరం తండ్రి వచ్చి ప్రొఫెసర్లందరికీ వేలకి వేలు డబ్బు జల్లి తనని పాస్ చేయించటం! ఇంచుమించు అక్కడ చదివే వాళ్ళందరూ అంతే! కష్టపడి సిన్సియర్‌గా చదివే వాళ్ళని చూస్తే నవ్వొచ్చేది ఎనాటమీచూసి జడుసుకునేవాళ్ళని నేళాకోళం చేసేవాళ్ళు ప్రతి ఏడాదీ జూనియర్స్‌ని రాగింగ్ చెయ్యటం చెప్పలేని ఎక్సయిట్‌మెంట్ కాలానికి రెక్కలొచ్చినట్లున్న ఆవేశంలో తనూ ఒక విహంగంలా సంతోష తరంగాలలో తేలిపోతున్నట్లుండేది.

అన్నట్లుగానే తండ్రి డిగ్రీ చేతిలోకిరాగానే మెడిసిన్ ఫస్టు క్లాసులో పాసయి ఎమ్. ఎస్. చేసిన రమేష్‌కిచ్చి పెళ్ళి చేసేడు. అందమైన నర్సింగ్‌హోమ్ కట్టించి ఇచ్చేడు ఆనందంగా ఇద్దరూ ప్రాక్టీసు మొదలు పెట్టేరు. రమేష్‌కి సబ్జెక్టులో చాలా ఇంటెరెస్ట్. ప్రాక్టీసు చేస్తూనే తను ట్రీట్ చేసిన కేసుల సహాయంతో రిసెర్చి చేస్తూ పేపర్స్ పబ్లిష్ చేసేవాడు. అటువంటి భర్త ప్రక్కనుండగా తన అజ్ఞానం ఏమాత్రం తెలిసిరాలేదు. పదిహేను రోజులక్రితం భర్త ఇంటర్నేషనల్ కాన్ఫరెన్స్ అటెండవటానికి నర్సింగ్‌హోమ్ భారమంతా తనపై వదిలేసి స్విట్జర్లండ్ వెళ్ళటంతో, తనేమిటో, శరవేగంతోఅభివృద్ధి చెందుతున్న వైద్య యుగంలో తన స్థానమేమిటో క్రమక్రమంగా తెలిసిరాసాగింది. జయలక్ష్మి తన దగ్గరకి రావటంతో పూర్తిగా

తెలిసింది జయలక్ష్మి గుర్తు రావటంతో శైలజకి భయంతో ఒళ్ళంతా కంపించింది. శైల వీపుమీద వున్న రమేష్ చెయ్యికూడా! నిద్రపోని రమేష్ శైలజని బలవంతంగా లేపి కూర్చోబెట్టి లైటు ఆన్ చేశాడు "శైలూ! నువ్వేదో నా నుంచి దాస్తున్నావ్ చెప్పకపోతే పూరకోను అనవసరంగా నన్ను బాధించక చెప్పు నువు చెప్పేంతవరకు నేను ఇలాగే కూర్చుంటాను."

"మీరు వెళ్ళాక వారం రోజులకి జయలక్ష్మి అనే ఆవిడ మన నర్సింగ్ హోమ్‌కి వచ్చింది. ఆవిడ భర్త ఏదో క్లర్కు. వాళ్ళకి ఇద్దరు పిల్లలు. అయిదేళ్ళ బాబు, మూడేళ్ళ పాప ట్యూబెక్టమీ ఆపరేషను చెయ్యమన్నారు. అది సింపుల్ ఆపరేషనేకదా అని, మీరు చేస్తుండగా చూశానుకదా అనే ధైర్యంతోనూ చేసేశాను డిశ్చార్జి చేసినప్పుడు బాగానే వుంది కాని ఈ రోజు మధ్యాహ్నం ఆమె తల్లిదండ్రులు, భర్త ఆవిడను మళ్ళీ హాస్పిటలుకి తీసుకొచ్చారు. ఆవిడ భరించలేని నొప్పితో మెలికలు తిరిగిపోతోంది. బ్లీడింగు అవుతోంది.ఆ డిశ్చార్జి చాలా వాసనవేస్తోంది. నాకు ఏమైందో తెలియలేదు భయంతో కాళ్ళూ చేతులూ ఆడలేదు. ఏం చెయ్యాలో తెలియక సెడెటివ్ ఇచ్చాను. మళ్ళీ ఏర్‌పోర్ట్‌కి వచ్చేముందు ఇంకో డోస్ ఇచ్చాను. ఆవిడ కండిషన్ అసలు బాలేదు."

ఆమె చెప్పటం పూర్తి చేసి తలెత్తేసరికి రమేష్ ముఖంలో కోపం చోటు చేసుకుంటోంది. "యూ ఫూల్! రాగానే నాకెందుకు చెప్పలేదు? డెలివరీ అయిన వెంటనే అయితే ట్యూబెక్టమీ సులభం కాని రెండేళ్ళయిన తరువాత అతిజాగ్రత్తగా చెయ్యాలని, లేకపోతే కాంప్లికేషన్స్ వచ్చే అవకాశంవుందనే అతి చిన్నవిషయం నీకెందుకు తెలియలేదు?" ఇంకా ఏమేమో అంటూ డ్రెస్‌చేసుకోసాగాడు.

"నర్సింగ్ హోమ్‌కి వెడుతున్నారా?" భయంగా అడిగింది శైలు.

"అవును"

"మీరిప్పుడు వెడితే తతిమా పేషెంట్లందరూ డిస్టర్బ్ అవుతారు. అయినా నేను సెడెటివ్ ఇచ్చాను కదా."

నీరసంగా మంచంమీద కూలబడ్డాడు రమేష్. అతని మనసులో ఎన్నో భయంకరమైన ఆలోచనలు సుళ్ళు తిరుగుతున్నాయి.

ఆ రాత్రి ఇద్దరూ ఒక సెకను కూడా నిద్రపోలేదు

పొద్దున్న ఏడు గంటలవరకు అతికష్టంగా ఇంటి దగ్గర గడిపి ఇద్దరూ హాస్పిటల్‌కి బయలుదేరారు. అంత త్వరగా వచ్చిన డాక్టర్లను చూచి పేషంట్సుకి ఆశ్చర్యం వేసింది. సేరుగా జయలక్ష్మి దగ్గరకు దారి తీసింది. కాని ఆమె రూముకి కొంచెం దూరంలోనే భయంతో ఆగిపోయింది. జయలక్ష్మి నొప్పితో అప్పుడప్పుడూ పెద్దగా మూలగటం, సన్నగా జయ తల్లి ఏడుపు వింటూ రమేష్ ఆమె చెయ్యిపట్టి ఇంచుమించు లాక్కెళ్ళున్నట్లు తీస్కెళ్ళాడు. జయలక్ష్మిని చూసిన వెంటనే నర్సునికేకేశాడు. ఆపరేషన్ ధియేటర్ సిద్ధంచేసి జయలక్ష్మిని ధియేటర్‌లోకి తీసుకెళ్ళమన్నాడు తను అనెస్థటిస్ట్‌కి ఫోన్ చెయ్యటానికి వెళ్ళాడు.

ధియేటరులో శైలజ అదిరే గుండెలతో రమేష్ పక్కనే నించుంది. రమేష్ అన్ని పనులూ చకచకా చేస్తున్నాడు. అన్నీ రెడీ అవగానే ప్రశాంతంగా నిద్ర పోతున్న జయలక్ష్మి ముఖం వంక ఒక్కసారి చూచి అబ్డామెన్‌పై పొడవుగా ఇన్సిషన్ చేశాడు. ఆ వెంటనే వచ్చిన దుర్గంధానికి అక్కడున్న వాళంతా అసంకల్పితంగా ఓ అడుగు వెనక్కి జరిగారు. ఆ దృశ్యం చూస్తుంటే ఎవరికైనా ఒళ్ళు జలదరించేలా వుంది. సహజంగా ఎర్రగా చిందవలసిన రక్తం లేదు. ఏదో రంగులో ఏ భాగం ఏదో తెలియని గందరగోళం. నున్నితంగా క్లీన్‌చేస్తున్నాడు రమేష్. హఠాత్తుగా "మైగాడ్" అన్నాడు.

"ఏమయింది?" ఆదుర్దాగా అడిగింది శైలజ.

కోపం బిగపట్టుకున్న స్వరంతో కొట్టినటు చెప్పాడు రమేష్. "నువ్వేచూడు! యుటెరస్ (గర్భకోశం) కొద్దిగా రప్చర్ అయింది. దీనివల్ల ఇంటర్నల్ హెమరేజ్ అయి దిసెరా అంతా బ్లడ్ క్లాట్ అయింది.

రమేష్ మాట ఇంకా పూర్తి కాలేదు. పల్స్ చూస్తున్న నర్సు ఆదుర్దాగా అంది. "డాక్టర్! నాకు పల్స్ అందటంలేదు" రమేష్ చేతిలో ఇన్‌స్ట్రుమెంటు జారిపోయాయి పల్స్ చూశాడు. నిస్పృహగా రెండునిమిషాలు తల పట్టుకున్నాడు. ఇది అతని ప్రాక్టీసులో మొదటి ఫెయిల్యూర్! చదువుకొనే రోజుల్లో ఎన్ని శవాలు కోసినా, హౌస్ సర్జన్ల రోజుల్లో గవర్నమెంటు హాస్పిటల్సులో తమ కళ్ళ ముందే ఎన్నోచావులు జరిగినా అవన్నీ ఒక ఎత్తు! ఇదొక ఎత్తు. తమ చేతుల మీదుగా అదీ తొందరపాటు కారణంగా ఒక వ్యక్తి మరణించటం ఇద్దరికీ షాక్‌లా వుంది.

నెమ్మదిగా అబ్డామెన్ క్లోజ్ చేసేశాడు. మాస్క్ తీసేస్తూ ధియేటర్‌లోంచి బయటకి నడిచాడు. జయలక్ష్మి భర్త, తల్లి తండ్రులు కూర్చున్నచోటికి వచ్చారు. అతని వెనకే వుంది శైలజ. ఇద్దరి ముఖాలు చూస్తుంటూనే వాళ్ళందరికీ ఏమయిందో అర్థమయి



పోయింది. తల్లి తండ్రి గొల్లుమన్నారు. భర్త నేలమీద కూచుండి పోయాడు. ఏడుస్తూనే బిగ్గరగా తిడ్తోంది తల్లి. "చేతగాని దానివి ఎందుకు చెయ్యాలి తల్లీ! బంగారం లాంటి నా కూతుర్ని పొట్టన పెట్టుకున్నావు. పిల్లగాళ్లని తల్లిలేని వాళ్లని చేశావు."

ఇతర పేషెంట్సు తాలూకు బంధువులు అక్కడ గుమికూడుతున్నారు. నేరస్తురాలిలా నుంచున్న శైలజ చెయ్యిపట్టి నెమ్మదిగా అక్కణ్ణించి తీసుకొచ్చేశాడు.

ఆ రోజంతా శైలజ మంచినీళ్లు కూడా ముట్టుకోలేదు. సాయంత్రం నర్సింగ్ హోంకి రమేష్ ఒక్కడే వెళ్లి వచ్చేశాడు. శైలజ బుర్రలో ఆలోచనలు గమ్యం లేకుండా పయనిస్తున్నాయి. ఆపరేషన్ థియేటర్లోకి జయలక్ష్మిని తీసుకెళ్ల బోతున్నప్పుడు ఆమె భర్త కళ్లలోని భయం, జాగ్రత్త సుమా అనే మూగ అభ్యర్థన గుర్తొచ్చాయి. అమాయకంగా "అమ్మా!"

# పరివర్తన

అంటున్న పసివాళ్ల ముఖాలు గుర్తొచ్చేయి. ఒక్కగానొక్క కూతుర్ని పోగొట్టుకున్న ముసలి తల్లితండ్రుల ఆవేదన కళ్ళముందు నిలిచింది. ఇంకా తను ఇలాగే ఎంతమందిని ...ఆ పైన ఆలోచించలేక పోయింది. ఇంకో దృశ్యం. తను కోర్టులో నిలబడి వుంది. తనపై దావావేసిన జయలక్ష్మి భర్త తనకి ఉరిశిక్ష విధించమని కోరుకుంటున్నాడు. మరో దృశ్యం! జనం తమ ఇంటి మీదకి వచ్చి రాళ్లు విసురుతున్నారు. అరుస్తున్నారు.

హఠాత్తుగా ఏదో నిర్ణయించుకున్నట్టు లేచిన శైలజని చూసి రమేష్‌కి భయం వేసింది. నేరుగా బీరువా దగ్గరకి వెళ్లి తన యమ్. బి. బి. యస్. డిగ్రీ సర్టిఫికేట్ తీసి ముక్కలుగా చించేసింది. తెల్లబోయిన రమేష్ వారించేలోగా "శైలజా ఏమిటీ పిచ్చి? ఒక్క కేసు మూలంగా ఇవ్విలా..."

"పిచ్చి కాదండీ! మా నాన్నగారు నాకు డాక్టరు జీవితంలోని గ్లామరు మాత్రమే చూపించారు. అందులోని బరువైనబాధ్యతను ఏ మాత్రం అర్థం చేసుకోలేకపోయాను. ఈ సంఘటనతో అది అర్థమయినా ప్రయోజనంలేదు. నేర్చుకోవలసిన కాలాన్ని అజ్ఞానంతో, అహంకారంతో జారవిడుచుకున్నాను. కాని నాకు ఈ పొరపాటుని సరిదిద్దుకోవాలని వుంది. ఇదే మొదటిది ఇదే ఆఖరిది కావాలని వుంది."

కొంచెం ఆగి అంది. "నేను యమ్. బి. బి. యస్. చదివాననే సంగతే మర్చిపోతున్నాను – నా కింకా వయసు రీత్యా అర్హత పోలేదు. ఈ ఏడాది మళ్లీ మెడిసిన్ కోర్సులో జాయినవ్వాలని వుంది."

రమేష్ ముఖంలో ఆశ్చర్యం, అపనమ్మకం, ఆఖరిగా ఆనందం!

"శైలా! నీ ఈ నిర్ణయం తెలివైనదో కాదో నాకు తెలియదు. కాని నిజాయితీ అయినదని మాత్రం తెలుసు. నీకు నా శాయశక్తులా సహాయం చేస్తాను." ★

# పరిష్కారం ?

డా. పోతుకూచి వెంకటేశ్వర్లు.




సమ్మైక్యత వర్ధిల్లాలి !

యూనియన్ జిందాబాద్!

వింటున్న నాకు అయోమయంగా అనిపించింది.

ఎవరి సమ్మైక్యత ? అందరం భరతమాత బిడ్డలమ్మైనప్పుడు అందరం సమ్మైక్యంగా వుండాలి.

అంతేగాని — విద్యార్థులు — విద్యాలయం వారికి — ఆ సిబ్బందికి మధ్య యింత ఘర్షణ ఎందుకు వచ్చినట్లు ?

బేధాభిప్రాయాలు వుండొచ్చుగాక ! ఒకే కుటుంబ సభ్యులలోనే బేధాభిప్రాయాలు వుండటం చూస్తూనే వున్నాం. అయినా ఏదో పరిష్కారం-ఏదో విధమ్మైన ఒడంబడిక —కొంత సర్దుబాటు ధోరణిలో వ్యవహరిస్తే —పరిస్థితులు దారుణ పరిణామాలకు దారి తియ్యవు కదా ?

అప్పటికి విద్యార్థుల సమ్మె ఉరోరోజు. పాలక వర్గం క్రి దికి దిగిరావటంలేదు, ఆ అవసరమూ వారికి లేదు

అసలు విద్యార్థులు తమ కోర్కెలు 'యివి' అని యితబద్ధంగా చెప్పలేకుండా వున్నారు.

మరి పరిష్కారం ? అంటే ? దేనికి ?

విద్యార్థులు మంచివారే, విద్యాలయాలు పవిత్రమ్మైనవే !

అయితే యిటువంటి సందర్భాల కోసమే పొంచి వుంటాయి కొన్ని అదృశ్య శక్తులు—

దీని ఆసరాగా తీసుకుని విజృంభిస్తాయి — వాటి ప్రాబల్యం పెంచుకోవాలని చూస్తాయి.

ఏమ్మైతేనేం — ఆ రోజు మూకుమ్మడిగా దుకాణాలు మూయించారు. బంద్ అని అన్నా భయంకొద్దీ మూసినవారే అంతా !

అయితే రోజువారి వంట దినుసులు లేక పొయ్యిలో పిల్లి లేవనంది చాలా గుడిసెల్లో— చాలమందికి హోటల్స్ శరణ్యమయ్యాయి.

అయితేస మత్రివస్థా ఖనుంచితారాస్థాయిని చేరుకోవటం - ఓ ఆధునాతన తినుబండాగారంలో విందారగించి-బిల్లు చెల్లించేందుకు డబ్బులేక —

నిలదీస్తే—ఏం చేస్తాం— ఆకలి — అటు సమ్మె — యిటు ఆత్మారాముడ్ని చల్లార్చుకోవాలి—మాకు వ్యవధిలేదు అక్కడకు వెంటనే చేరుకోవాలి — అటూ వుడాయించ చూసిన విద్యార్థులను హోటల్ వాళ్లు అటకాయించారు. దాంతో వారు వానరసేనే అయారు— కనపడ్డది కనబడినట్లు పగలగొట్టారు.

బిల్లు వొదులుకున్నా బాగుండేది — కొంచెంతో పోయేది - యిప్పుడు యజమానికి నష్టం చాలానే అయింది. అందుకే అణుచుకోలేక పోలీసులకు ఫోను జేసారు.

వ్యాను రావటం—ఉద్రుతం చూసి పోలీసులు వురకటం — అక్కడ కనబడిన వారినల్లా లారీలకి ఎర చెయ్యటం !

అయితే జరిగిందేమంటే అసలు అల్లరి చేసిన విద్యార్థులు వుడాయించారు-అమాయకులు అక్కడ మిగిలారు.

దాంతో [illegible] లేచింది. బస్సుల రాకపోకలు ని[illegible]పె[illegible]లని పిలుపు - అంతే ఎక్కడి బస్సులు అక్కడ ఆపేస్తున్నారు. అలా అయినా బాగుండును—దాంట్లో అత్యవసరంగా వెళ్లాల్సినవాళ్లు — మధ్యలో ఆపుతే ఎలా ? స్టాండులో చెప్పినా మరో మార్గం

# సాటిలేని మాటకారి గాంధీజీ!

గాంధీజీ గొప్ప వక్త కాకపోవచ్చు, కాని మంచి మాటకారి ఆయన మాటల్లో నెగటు పుట్టని హాస్యం తొంగిచూస్తూ వుంటుంది. కొందరు మాట్లాడితే ఒంటి మీద తేళ్ళూ జెర్రులూ పాకినట్టు ఉంటుంది, కొందరు మాట్లాడితే మల్లెపూల వాసన గుబాళించినట్టు ఉంటుంది. గాంధీజీ మాటలు అలాంటివి!

ఒకసారి ఒకాయన గాంధీజీని చూసి ఇలా అడిగాడు! 'గాంధీజీ! మీరు రైలు ప్రయాణం చేసేటప్పుడు, ఎందుకు మూడో తరగతి పెట్టెలోనే ప్రయాణం చేస్తారు?'

వెంటనే గాంధీజీ ఏమన్నారో వినండి.

'నాలుగోతరగతి పెట్టెలేదు కనుక'

ఆ రోజుల్లో రైళ్ళల్లో ఒకటి, రెండు, మూడుతరగతుల పెట్టెలుండేవి.

* * *

మరోసారి ఒక ప్రముఖుడు గాంధీజీని ఇలా ప్రశ్నించాడు :

'బాపూజీ! కాంగ్రెసు అధికారంలోకి వస్తుందా?'

'ఏం, మీరు మంత్రి కావాలనుకుంటు న్నారా?'

అంతే. ప్రశ్నించిన ఆ ప్రముఖుడు మళ్లీ నోరు విప్పలేదు.

* * *

చార్లీ చాప్లిన్ చాలా గొప్పవాడు, ఇతరుల్ని నవ్వించడంలో ఆయనకి ఆయనే సాటి. హాస్యరసం ఆయనకి వెన్నతో పెట్టిన విద్య అన్నా అతిశయోక్తి కాదు అలాంటి చాప్లిన్ ఒకసారి గాంధీజీ ఇంగ్లండులో ఉండగా ఆయన్ని చూడడానికి వెళ్ళాడు చాప్లిన్ ఎవరని గాంధీజీ అమాయకంగా అడిగాడు, పరిచయం చేసిన ప్రముఖుణ్ణి చూసి.

ఆ తర్వాత వాళ్ళిద్దరూ మాటల్లో మునిగిపోయారు మాట్లాడినంతసేపూ, గాంధీజీ చాప్లిన్ని కడుపుబ్బ నవ్విస్తూనే వున్నాడట!

* *

రౌండ్ టేబిల్ కు వెళ్ళిన గాంధీజీ లండన్ ను దేశానికి తిరిగి వచ్చాడు మన దేశంలో అడుగు పెట్టాడో లేదో ఎవరో, 'బాపూజీ! నైహూ, సరిహద్దు గాంధీ ప్రభుత్వుల్ని అరెస్టు చేశారు' అని చెప్పారు

'మన వైస్రాయిగారయిన విల్లింగ్డన్ ప్రభువుగారు మన కిచ్చిన క్రిస్మస్ బహుమతులివి' అన్నాడు గాంధీజీ బాధగా.

* * *

దక్షిణాఫ్రికాలో జరిగిన ముచ్చట ఇది

గాంధీజీని కొందరు సరిగా అర్థం చేసుకో లేదు వాళ్ళు ఆయన మీద పగ బట్టారు.

ఒకరోజు గాంధీజీ, ఆయన మిత్రుడు కలిసి బయలుదేరారు మిత్రుడి కోటుజేబు బరువుగా ఉంది అది పసిగట్టి గాంధీజీ, 'ఏమిటది?' అని అడిగాడు మిత్రుడు బిత్తరపోయాడు 'మీకు రక్షణగా ఒక చేతి తుపాకీ నా కోటు జేబులో ఉంచాను. అవసరమైతే ...' అని అసలు విషయం బయట పెట్టాడు

గాంధీజీ ఒక్క నవ్వు నవ్వాడు: 'నన్ను కాపాడేది యీ చేతి తుపాకా! ఆ దేవుడే నాకు దిక్కు' అని మళ్లీ నవ్వాడు

ఆ మిత్రుడు వెంటనే జేబులోంచి తుపాకీ బయటికి తీసి, దూరంగా దాన్ని విసిరివేశాడు.

— చల్లా రాధాకృష్ణశర్మ

---

చూచుకునే వారం కదా! బస్సు కదలనీయండి''-అన్న వారిమీద అఘాయిత్యం —బస్సులు ధ్వంసం.

యంత్రాంగంపూరుకోవటానికివీలులేదుగా? అందుకే లాఠీచార్జీలు—భాష్పవాయుగోళాలు— గాలిలోకి కాల్పులు.

సామాన్యుడు బయటకు రావాలంటే గుండె దడ పుడుతోంది.

అయితే బస్సులూ నడిపిస్తున్నారు.

అటు అల్లరి జరుగుతూంది.

స్టూడెంట్స్ అన్న వారిని చావబాదు తున్నారు. ఎన్నోచోట్ల బస్సులను నిలప నందుకు ( ఆపనందుకు ) పెట్రోల్ కోసి— డ్రైవర్ని చితకబాదు తున్నారు.

దహనకాండకు పాల్పడిన మూకను చెదర గొట్టటానికి లాఠీలు విరిగిపోతున్నాయి.

## పరిష్కారం?

ప్రభుత్వ వైద్యశాల కిట కిట లాడి పోతోంది. పని తొక్కిసలాటగా వుంది

గాయపడ్డ వారు - వారి బంధువులు — మిత్రులు — ఏమీ కాకపోయినా — వారికి ఏ విధమైన సంబంధము లేకపోయినా — ఏ పనీ లేనివాళ్ళు — తమాషాగా చూడటానికి వచ్చిన వాళ్లు—వైద్యం చేయటానికి కూడా చోటివ్వ కుండా జనం.

ఈగలు మూగినట్లు—అలాగే కుళ్లినట్లు గాయాలతో కొందరు పక్కల మీదకు చేర్చబడ్డారు.

మూలుగులు—ఏడుపులూ—

అరుపులు—అదిలింపులు—

ఆ అల్లకల్లోలంలో చెయ్యి జాగ్రత్తగా పట్టుకుని కుడివైపుకి తిరిగిన డ్రైవరు అమరయ్య బాధతో వ ల్గాడు

విరిగిన చేతినెప్పివల్లనో—ఎదురుకుండా — నెత్తికి బాండేజి కట్టబడి అచేతనంగా పక్కబెడ్మీ మీద పడున్న కొడుకును గుర్తించో!

ఎవర్నిఉద్ధరించాయి?

ఎవరికి మేలు చేస్తాయి?

ఈ నిరసనలు — సమ్మెలు!!

దేనికైనా పరిష్కారం ఆలోచించాలి గాని— ఆవేశంతో ఉద్యమాలు — దహనకాండలు జరుపుతే జరిగే నష్టాన్ని పూడ్చగలమా?

చదువుకోవలసిన కొడుకు — ఉద్యోగం చేస్తున్న డ్రైవరు—వీరి భవిష్యత్తు?

ఈ వలయాన్ని ఛేదించే పరిష్కార మార్గం?

# మీ పాపాయికి అప్పుడే 3 నెలలు నిండాయా?

అయితే ఇక మీదట కేవలం పాలే
మీ పాపాయికి కావలసిన ఐరన్ సమకూర్చలేవు.

## అతడికి పుష్కలంగా ఐరన్ కల ఫారెక్స్ ఇవ్వండి

"తల్లి నుంచి పెద్ద ఐరన్ నిల్వతో సహా పుడతాడు పాపాయి. అయితే పుట్టిన తర్వాత ఈ నిల్వ క్రమేపీ తరిగి పోతుంది. పాలు మంచి ఆహారమే అయినప్పటికీ, ఐరన్ లేనందు వల్ల అది సంపూర్ణ ఆహారం కాదు. అందుకే పాపాయికి ఐరన్‌గల ఘన ఆహారాలు కావాలి."

—డాక్టర్. సుభాష్ సి. ఆర్య "ఇన్‌ఫెంట్ అండ్ చైల్డ్ కేర్ ఫర్ ద ఇండియన్ మదర్."

అందుకే, 3 నెలలు నిండాక, మీ పాపాయికి కావలసిన ఐరన్‌ను సమకూర్చగల ఘన ఆహారం ఇవ్వడం ప్రారంభించండి. ఐరన్ మీ పాపాయి రక్తానికి, రోగ నిరోధక శక్తిని ఇవ్వడానికి, శరీర ఆరోగ్యానికి, అతడి పెరుగుదలకూ, వికాసానికి అతి ముఖ్యం అతడికి పుష్కలంగా ఐరన్ కల ఫారెక్స్ ఇవ్వడం ప్రారంభించండి.




ద్రవ ఆహారాన్ని క్రమంగా తగ్గించి ఘన ఆహారాలు ప్రారంభించడం కోసం ప్రత్యేకంగా తయారు చేయబడిన ఆహారం ఫారెక్స్. దీనిలో సత్వర పెరుగుదలకు ప్రోటీన్లు; శక్తి కోసం కార్బోహైడ్రేట్లు, కొవ్వు పదార్థాలు; దృఢమైన ఎముకలు, గట్టి పళ్ల కోసం కాల్షియం, ఫాస్ఫరస్, విటమిన్లు కలవు అంతేకాదు, ఫారెక్స్‌లో పుష్కలంగా ఐరన్ కూడా ఉంది. ఇది మీ పాపాయి శరీర ఆరోగ్యానికి మరియు అతడి పెరుగుదలకూ అతి ముఖ్యం.

**ఫారెక్స్**

డాక్టర్లు సిఫార్సు చేస్తారు ఫారెక్స్.
మీ పాపాయి కోసం పుష్కలంగా ఐరన్ కల ఆదర్శవంతమైన ఘన ఆహారం.

CASGLF-32 244 Tl

# సీరియల్ దాంపత్య సంగీతం

## శ్రీమతి కళ్యాణీ సోమరాజ్

సాయంకాలం ఫ్లైట్ ఇంకో గంటలో బయలు దేరుతుందనగా, గబగబ డ్రస్ చేసుకుని క్రిందకు దిగి వచ్చాను

"ఏమ్మా రిసెప్షన్‌కి వెళుతున్నావా !" అని అడిగారు హాల్లో కూర్చున్న నాన్నగారు

"ఔనండి" అన్నాను తండ్రితో అబద్ధం చెప్పాల్సి వచ్చినందుకు మనసులో బాధగానే వుంది కాని నాకు, కుమార్‌కి వచ్చిన గొడవలు నాన్నగారికి ఇప్పుడే తెలియటం అంత మంచిది కాదనిపించింది

ఇంతలో "స్వాతీ !" అన్న పిలుపు, గాలి దుమారంలా డాక్టర్ అంకుల్ వాళ్ళ అమ్మాయి మంజుల వచ్చి నన్ను చుట్టేసింది మంజుల, నేను ఇంటర్ మీడియట్ వరకు క్లాస్‌మేట్స్ కూడాను అయితే ఆ తరువాత ఆమె బి యస్ సి కి, నేను మెడిసిన్‌కి పోవటం వలన మా దారులు వేరైనా మా కుటుంబాల మధ్య వున్న స్నేహం మా మైత్రిని అలాగే నిలిపింది

"ఎక్కడికి బయలుదేరావ్ పొద్దున పెళ్ళికి ఎందుకు రాలేదని అడిగి, నిన్ను తీసుకు వెళ్ళటానికి వచ్చాను డాడి మీరెవరూ రానందుకు చాలా బాధ పడ్డారు తెలుసా !" అంటూ మంజుల నా చేయి పట్టుకుని సోఫాలో కుదేసింది

"ఇప్పుడే మీ ఇంటికే బయలుదేరింది" నాన్నగారు ఆమెను సమాధానపరచాలన్నట్లు అన్నారు

"ఔను మంజులా !" అన్నాను బలవంతంగా నవ్వుతూ ! మనసంతా ఎందుకో ఖంగారుగా వుంది

"అయితే పద పొద్దున లాగా ఇప్పుడు కూడా రాకుండా తప్పించుకుంటావేమోనని నేనే వచ్చాను "

"మంజుల కేదైనా కాఫీగాని టీ గాని తీసుకు రామ్మా" అన్నారు నాన్నగారు

నేను అన్యమనస్కంగానే వంటింటివైపు నడిచాను నేను 'టీ' కలిపి తీసుకొచ్చేసరికి, మంజుల

(గత సంచిక తరువాయి)

తను, వాళ్ళ ఆయన ఈమధ్య వెళ్ళిన యూరప్ ట్రిప్ గురించి తెగ చెప్పేస్తోంది 'టీ' చల్లారి పోతోందని నేను రెండుసార్లు హెచ్చరించిన మీదట గబగబ టీ త్రాగి మళ్ళీ కబుర్లల్లో పడిపోయింది ఇక లాభం లేదని 'రిసెప్షన్ టైమౌతోందని' నేనే హెచ్చరించి బయటకు లాక్కొచ్చాను ఆమెను !

"పెళ్ళి అయినా నీ వాగుడు తగ్గలేదు" అన్నాను కార్లో ఆమె పక్కన కూర్చున్నాక

"సరే నీకు పెళ్ళయ్యాక ఎంత వాగటం అలవాటైందో చెప్పు వింటాను" అంది

"కుమార్ నీలాటి వాడే ! మొదలుపెట్టా డంటే ఆపడు అక్కడా శ్రోతనేనే !"

"మీ మ్యారేజ్ లౌ మ్యారేజ్‌ట కదా ! డాడీ చెప్పారు "

"ఔను "

"బాగా అడ్జస్ట్ అయ్యావా !" అంది నా వంక అదోరకంగా చూస్తూ

"అంటే ! నా కర్థంకాలేదు !" ఆమె ఉద్దేశ్యం నిజానికి నా కర్థంకాలేదు

"అదే ! అతను చాలా పూర్‌టకదా !"

"ఫరవాలేదు రెండుపూట్ల అన్నం తినగలిగిన శక్తి వుంది పస్తులుండటం లేదులే" అన్నాను కొంచెం రోషంగా

"సారీ నీకు కోపం వచ్చినట్లుంది నా ఉద్దేశ్యం అదికాదు అంతస్తుల్లో మీ ఇద్దరి మధ్య అంత తేడా వుంది కదా ! ఒక్కసారి ఆ మార్పుకి ఎలా తట్టుకోగలిగావా ! అని, అంతే "

"నేను మొదటినుంచి ఆస్తులకోసం అంతస్తుల కోసం పాకులాడే మనిషిని కాదులే అందుకని నాకు బాధ కలిగించలేదు "

తరువాత మంజుల ఏం మాట్లాడలేదు నేను కూడ ఎలాగైనా కుమార్‌ని కలుసుకోగలిగితే బాగుండునన్న ఆలోచనలో పడిపోయాను మనసంతా ప్లేన్ ఎక్కడ దాటిపోతుందో అన్న బెంగగావుంది

"మంజులా ! అర్జంట్‌గా నే నొకర్ని ఎయిరో డ్రోమ్‌లో మీటవ్వాలి నన్నక్కడకి తీసుకువెళ్ళు ఒక్క ఐదు నిముషాల పనే" అన్నాను వుండబట్టలేక

"అలాగే ! ఎవరువాళ్ళు !"

"ఎవరో నా ఫ్రెండ్‌లే ఇరాక్ వెళుతోంది !" అన్నాను కుమార్ అని చెబితే వచ్చే చిక్కులు ఊహించుకుంటూ

కారు ఏయిరో డ్రోమ్‌లోకి రాగానే, గబుక్కున డోర్ తీసుకుని "నేను ఇప్పుడే వచ్చేస్తాను ఇక్కడే వెయిట్‌చేయి" అనేసి పరుగులాంటి నడకతో లోపలికి వెళ్ళాను

ఇన్‌ఫర్‌మేషన్ సెంటర్‌లో కుమార్ వెళ్ళే ఫ్లైట్ గురించి అడిగాను

"ఇటీజ్ యబౌట్ టూ ఫ్లై" అన్నాడతను

నిరాశగా ఒక్కసారి, గ్లాస్ డోర్స్‌నుండి బయటకు చూశాను రెక్కలు చాచుకున్న విమానం అప్పుడే ఆకాశం వైపు పరుగు తీస్తోంది అప్రయత్నంగా కళ్ళనీళ్ళు వచ్చాయి మా ఇద్దరి మధ్య వచ్చిన అపోహలు అలాగే నిలిచిపోతాయి కాబోలు దివ్యని కనీసం కళ్ళతోనైనా చూడలేదు

"ఏం అలా వున్నావ్ ప్లేన్ వెళ్ళిపోయిందా ?"

అంది మంజుల వంగి కారు తలుపు తీస్తూ

"ఆఁ" అన్నాను నుదుటను పట్టిన చెమటను కర్చీఫ్‌తో అద్దుకుంటూ !

కారు డాక్టర్ అంకుల్ వాళ్ళింటి ముందు ఆగింది యాంత్రికంగా దిగాను అంకుల్, ఆంటి పొద్దున పెళ్ళికి రానందుకు నిష్ఠూరాలాడారు మంజుల నన్ను మేడమీద పెళ్ళికూతురున్న గదికి చేయి పట్టుకొని తీసుకెళ్ళింది

పెళ్ళికూతురు కన్పించకుండా, అక్కడ చాలా మంది ఆడవాళ్ళు, పిల్లలు గుంపుగా చేరారు ఏవో ఛలోక్తులతో, జోక్స్‌తో, నవ్వులతో ఆ హాలంతా రణగణ ధ్వనిగా వుంది మంజుల వాళ్ళని కొంచెం దారివ్వమని అడుగుతు నన్ను ముందుకు లాక్కెళ్ళింది పెళ్ళికూతుర్ని రిసెప్షన్‌కోసం ఇద్దరు ముగ్గురు ఆడవాళ్ళు ఆమె చుట్టు నిలబడి అలంకరిస్తున్నారు

"ఇదిగో వదినా ! ఈమె డాక్టర్ స్వాతి అని నా బెస్ట్ ఫ్రెండ్" అంటూ పరిచయం చేయసాగింది మంజుల

ఒక్కసారి పెళ్ళికూతురు నా వంక చూసింది ఇద్దరం ఒకేసారి ఆశ్చర్యపోయాము చిరునవ్వు

**జరిగిన కథ — 8 :** స్వాతి, కుమార్ వివాహం చేసుకొని విశాఖపట్నంలో కాపురం పెడ్తారు స్వాతి ఎం బి బి యస్ ఫస్ట్‌క్లాసులో పాసవుతుంది అక్కడే హౌస్ సర్జన్ చేస్తుంటుంది కుమార్ ఇంటి ఓ భాగంలో ప్రాక్టీస్ ప్రారంభిస్తాడు స్వాతికి మామితో పరిచయం కల్గుతుంది ఆ బిల్డింగ్‌లోనే అద్దెకుంటున్న శారదకి పెళ్ళయి ఇంత కాలమయినా ఇంకా పుట్టింటనుంచి ఏవో తేలేదని ఆమెను పుట్టింటికి వెళ్ళనీయకుండా ఎప్పుడూ దేనికో ఓదానికి హింసిస్తున్న భర్తనుండి రక్షించి ఆమెకు జీవనాధారం చూపించాలని ప్రయత్నిస్తుంటుంది స్వాతి భర్తతో తెగతెంపులు చేసుకొని స్వాతి సహకారంతో హైద్రాబాద్ వెళ్ళటానికే నిశ్చయించుకొంటుంది శారద కూతురు పేరు 'దివ్య' అని పెట్టుకుంటాడు కుమార్ దివ్య పుట్టిన తరువాత స్వాతి కుమార్‌ల మధ్య మనస్పర్థలూ, చికాకులూ ఎక్కువవుతాయి స్వాతి పాప పెంపకంలో నిర్లక్ష్యం చేస్తోందన్న అభిప్రాయంతో దివ్యను వదిన దగ్గిర వదిలి వస్తాడు కుమార్ ఒంటరిగా వున్న తండ్రి ఆరోగ్యం క్షీణించటంతో స్వాతి వెళ్ళి ఆయనకు సపర్యలు చేస్తుంటుంది డబ్బుకోసమే వెళ్ళి అక్కడ వుంటోందన్న అపోహతో తనూ డబ్బు సంపాయించడాన్కి ఇరాక్ వెళ్తున్నట్లు ఉత్తరం ద్వారా తెల్పుతాడు ఆమెకి కుమార్






నవ్వుతున్న ఆమె పెదాలు పూర్తిగా విచ్చుకోకుండానే ముడుచుకున్నాయి

"మా వదిన రాణి" అంది మంజుల

"తెలుసు" అందామనుకొని మానేసాను అంతలో ఏదో నగలపెట్టె తీసుకువచ్చిన రాణి తల్లి, నన్ను చూడగానే ఏదో పులిని చూసినట్లు బెదురు చూపులు చూడటం నేను గమనించాను

"మీ వదిన చాలా స్వీట్‌గా వుంది మంజులా!" అంటూ మంజుల చేయి పట్టుకొని ఇవతలకు తీసుకు వచ్చాను

రాణి బిగుసుకొని అలాగే కూర్చునుంది పాపం నా రాక మూలంగా ఆమె ఆనందం చిన్నాభిన్నం అయి వుంటుంది పిచ్చిపిల్ల! తన విషయం నేను అందరికి చెప్పి ఆమె జీవితాన్ని పాడు చేస్తానను కొంది కాబోలు ఏది ఏమైనా ఆనాడు కుమార్ చెప్పినట్లు రాణి ఒక ఇల్లాలైంది ఆమె జీవితం అడవి గాచిన వెన్నెల కాలేదు! అనుకుంటే నా కెంతో తృప్తికలిగింది

## 16

ఆ రోజు పొద్దున్నే వంట మామ్మగారు కాఫీ ఇస్తుండగా, కొంచెం తాగగానే, వాంతి చేసేసు కున్నాను

"అమ్మాయ్! నిన్ను అడుగుదామా, వద్దా అని ఈమధ్య నాలో నేనే అనుకుంటున్నాను ఏమైనా విశేషమా! చెప్పు తల్లి సంతోషపడతాను నీ మొదటి పురుడు నువ్వె పోసుకున్నావ్ ఈసారైనా మా చేతులమీదగా కానీయ్!" అన్నారామె ఆశక్తిగా నా వంక చూస్తూ

నేను అలాగే నీరసంగా కుర్చీ లాక్కుని కూర్చున్నాను ఈ విషయం ఇక్కడకొచ్చిన కొత్తల్లోనే నాకు' చూచాయగ తెలిసింది కాని నాన్నగారు అప్పుడున్న స్థితిలో నాకు ఆనందంగాని, సంతోషంకాని ఏమి కలగలేదు ఇప్పుడు నిజంగా సంతోషమే కలుగుతోంది ఒక్కసారి నా కెవ్వరూ లేరనుకుంటున్న ఈ సమయంలో, నాకో తోడు దొరకబోతోంది

"ఏమ్మా! నీరసంగా వుందా! పోనీ హార్లిక్స్ తాగుతావా ?"

"అబ్బె ఏమొద్దండి ఏమి తాగాలనిలేదు కాస్సేపు ఆగితే అదే సర్దుకుంటుంది" అన్నాను లేస్తూ

"ఇంతకీ నేను అన్నది నిజమేనా!"

"ఆఁ" అన్నాను నవ్వుతూ

ఈ విషయం మెల్లగా నాన్నగారిదాకా వెళ్ళింది వంటమామ్మగారి ద్వారా! నాన్నగారు చాలా సంతోషం వెలిబుచ్చారు "స్వాతీ! ఈ రోజే కుమార్‌ని, దివ్యని రమ్మని ఉత్తరం వ్రాయి నువ్వు కూడ ఇక్కడకొచ్చి చాలా రోజులైంది నా ఆరోగ్యం నిన్ను ఇన్నాళ్ళ ఇక్కడ కట్టి పడేసింది అతను ఇక్కడకు రావటానికి ఇష్టపడకపోతే సరే పోనీ ఆ విషయం నువ్వు మనసులో పెట్టుకోక అయినా అతను వస్తే ఒకసారి నేను అడుగుతాను" అంటూ నాన్నగారి ప్లాన్స్ అన్నీ అమాయకంగా నాకు చెబుతుంటే నవ్వు వచ్చింది ఇక నాన్నగారితో కుమార్ ఇరాక్ వెళ్ళిన విషయం దాచటం అర్థం లేదనిపించింది మెల్లగా నాన్నగారితో నేను అంతకు ముందు అందంగా అల్లివుంచిన కథతో అసలు విషయం చెప్పాను

కుమార్ కనీసం వెళ్ళేముందుకూడ ఇక్కడకు రాకుండా వెళ్ళిపోయినందుకు నాన్నగారు చాలా బాధ పడ్డారు

"మరి నువ్వుకూడా వెళతావా!"

"లేదుడాడి అతనుఎలాగు రెండు"మూడేళ్ళలో తిరిగి వస్తాడు కదా ఈలోగా నేను ఎమ్ ఎస్ చేస్తాను అతను వచ్చాక ఇద్దరం కలిసి ఏదైనా నర్సింగ్‌హోం పెట్టుకోవచ్చు" అన్నాను

నా నిర్ణయం విని నాన్నగారు బదులు ఇవ్వలేదు ఆయనకి నేను చెప్పిన విషయాలు పూర్తి సంతృప్తి కలిగించినట్లు లేదేమో మరి!

* * *

చెప్పటం ఆపి అలసటగా సోఫాకి జారగిల పడింది స్వాతి!

"ఒక్క నిముషం స్వాతి! నాయర్ బహుశ ఫ్రిజ్‌లో పాలుంచి వెళ్ళింటాడు మనిద్దరికి కాఫి తీసుకొస్తాను" అంటూ రుక్మిణీదేవి స్వాతిని ఒంటరిగావదిలి పావుగంటలో కాఫికలిపి తీసుకొచ్చారు

"మీకు చాలా బోరు కలిగిస్తున్నట్లున్నాను" అంది కాఫీ అందుకుంటూ స్వాతి

"లేదు స్వాతి ప్రొసీడ్! కాని నాకో సందేహం నువ్వు కుమార్‌ని ఎయిర్‌పోర్టులో మీటవలేక పోయావు కదా, అతనికే డైరెక్ట్‌గా ఒక ఉత్తరం ఎందుకు వ్రాయలేదు మీ కేస్ మొదటి నుంచి విచిత్రంగానే వుంది కుమార్‌లోగాని, నీలోగాని వెతికి చూసినా ఏ లోపాలు లేవు మీ ఎడబాటు కేవలం భగవత్ కల్పితంలా వుంది"

స్వాతి చిన్నగా నవ్వి అంది "అలా అని నేను అనుకోవటంలేదు డాక్టర్! కుమార్ నాకు మధ్య ఎప్పుడైతే చలిమంటల్లాంటి అపోహలు, అపార్థాలు మొదలైయ్యాయో మా ఇద్దరి మధ్య అప్పుడే మాకు తెలియకుండా మా ఎడబాటుకి పునాదిరాయిపడింది"

## 17

కుమార్ గురించి పూర్తి వివరాలు వ్రాయమని అతని స్నేహితులకు వ్రాసాను చాలా త్వరగానే వాళ్ళ

దగ్గర నుంచి సమాధానం వచ్చింది కుమార్ వెళ్ళిన చోటు అతని అడ్రస్‌తో సహా అన్ని వివరంగా వ్రాసారు అయితే ఆ అడ్రస్ తీసుకుని పిలవని పేరంటంలా అతన్ని వెతుక్కుంటూ నేను వెళ్ళటమా, లేక అతనికోసం ఇక్కడే ఎదురు చూడటమా ! అని ఆలోచించి చివరకు, నేను ఇరాన్ వెళ్ళకూడదన్న నిశ్చయానికే వచ్చాను అయితే నాన్నగారికి నా విషయం చాలా బెంగ కలిగించేది ఆయన నన్ను రోజుకొకసారైనా హెచ్చరించేవారు – "నువ్వు అతని దగ్గరకెళ్ళిపో అమ్మా! నీ ప్రయాణం ఏర్పాట్లు నేను చూస్తాను" అంటూ కాని నేనే 'వెళతానని' అనలేదు అందుకు కారణం కుమార్ నా పట్ల ప్రవర్తించే నిర్లక్ష్య వైఖరి కావచ్చు, నా పట్టుదల కూడ కొంత కారణం కావచ్చు

అయితే ఎమ్ ఎస్ చేద్దామన్న నా ఆశలు మరో విధంగా భగ్నమైయ్యాయి !

ఆ రోజు పొద్దున్న నాన్నగారికి మందు ఇద్దామని ఆయన గదిలోకి వెళ్ళాను నాన్నగారు ఇంకా నిద్రపోతూనే వున్నట్లు కన్పించింది ఒక చేయి గుండెమీద వుంది ఎందుకో అనుమానం అన్పించి ఆయన్ని కుదిపి చూసాను దేహం మంచులా తగిలింది ఎవ్వరికి ఒక్కమాట చెప్పకుండానే, నాన్నగారు ఈ ప్రపంచాన్ని వదిలివెళ్ళారు మరోసారి నేనెవ్వరు లేని దిక్కులేని దాన్ని అయ్యాను ! ఆ క్షణంలో కన్నీళ్ళు రాలేదు మనసు స్థంభించింది ఏం జరుగుతోంది? ఇలా ఎందుకు జరిగిందో ఆలోచించే లోగా జరగవలసిన చాలా కార్యాలు జరిగి పోయాయి అన్నిటిలో నేను ప్రేక్షకురాలిలా వుండి పోయాను

పదోరోజున మా ప్లీడర్‌గారు నాన్నగారు వ్రాసిన విల్లు అందరి ముందు చదివిన్పించారు ఆయనకున్న ఆస్తులన్నిటిని శారదకి, నాకు సమంగా వ్రాసారు ఇల్లు మాత్రం నాకే చెందాలని, శారదకి దాని బదులు క్యాష్ బ్యాంక్‌లో వేసానని వుంది అంతే కాకుండా ఏళ్ళ తరబడి మమ్మల్ని నమ్ముకొని పని చేస్తున్న పనివాళ్ళకి ఒక్కొక్కళ్ళకి తలో రెండు వేలు, వంట మామ్మగార్కి ఐదువేలు ఇవ్వమని వ్రాసారు

# దాంపత్య సంగీతం

నాన్నగారు ఎవ్వరికీ ఏమి అన్యాయం చేయలేదు అయితే, నాన్నగారితో "మీ ఆస్తి అంతా శారదకే ఇవ్వండి" అని నేను చాలాసార్లు చెప్పినా వినలేదు

ఆ విల్లు చదవటం పూర్తి అయిందో లేదో, శారద అత్తగారు, "ఆస్తి అంతా ఇష్టమొచ్చినట్లు దానాలు చేసాడు ఆ ముసలాయన దగ్గరుండి ఏ మందుపెట్టి వ్రాయించుకుందో మరి ఆ తండ్రిచేత" అంటూ నాకు విన్పించేలా అనటం, అంత బాధలో కూడ నాకు కోపం తెప్పించింది

"మనిషిపోయి ఇంకా కొన్నిరోజులే అయిందే! అప్పుడే తగాదాలా? మీరైనా, నేనైనా ఇంత తాపత్రయపడి పోగుచేసి వెళ్ళేటప్పుడు ఏం తీసుకెళ్ళం – ఎవ్వరికో ఇచ్చి వెళ్ళాల్సిందే! ఆస్తి మీద ఆపేక్ష నాకేనాడు లేదు ఈ క్షణంలో నా ఆస్తి అంతా శారదకంతా వ్రాయమంటే, నేను సిద్ధమే! కాని మిగిలినవాళ్ళ విషయంలో నాన్నగారు ఎలా వ్రాసారో అలాగే జరుగుతుంది వాళ్ళంతా ఇన్నాళ్ళు విశ్వాసంతో మమ్మల్ని కనిపెట్టుకున్న మా బంధువులు" అని దృఢంగా నేను చెప్పేసరికి శారద అత్తగారు మొహం మాడ్చుకొని అక్కడనుంచి వెళ్ళిపోయింది

ఆ తరువాత అందరిముందు ఒకరోజు నా ఆస్తినంతా శారద పేరు ట్రాన్స్‌ఫర్ చేయించి రిజిష్టర్ చేయించాను ఇలా చేయటానికి ఏ మాత్రం ఒప్పుకోలేదు ప్లీడర్‌గారు "డాక్టరంకుల్! వంటమామ్మగారు కూడ నాకెంతో నచ్చచెప్పాలని చూశారు ఈ విషయంలో ఎవరిమాట వినదలుచుకోలేదు నేను లోకంతో పాటు కుమార్ కూడా నాకు డబ్బు పిచ్చి అనుకుంటూ వెళ్ళిపోయాడు"

వంటమామ్మగారు డబ్బుతీసుకొని తన కొడుకు దగ్గరకు వెళ్ళిపోయారు ఆ రోజే సామానంత సర్దుకొని ఆ ఇల్లు శారద అత్తగారు వాళ్ళకప్పగించి నేను బయటకెళ్ళాలని నిశ్చయించుకున్నాను

"ఏమ్మా! ఎక్కడికి వెళదామనుకుంటున్నావ్!" అని అడిగారు

నిజానికి అప్పటికి ఆ ప్రశ్నకి సమాధానం నా దగ్గరలేదు నిజమే ఎక్కడికి వెళతాను

"ఏదైనా అద్దెకు ఇల్లు దొరుకుతుందేమో చూసుకోవాలి అంకుల్ !" అన్నాను

"పిచ్చిపిల్ల మేమంతా బతికుండగా నిన్నిలా ఒంటరిగా వదిలేస్తామా ! అయినా నీకో విషయం చెప్పాలి స్వాతి ! మీ నాన్న నెలరోజుల క్రితం నాకో సంగతి చెప్పాడు–

"చూడు మూర్తి ! స్వాతి సంసారం ఎందుకో సరిగ్గా లేదని నా కనిపిస్తోందోయ్ ! తల్లివుంటే మనసులో కష్టం చెప్పకునేదేమో! నేనెన్నిసార్లు అడిగినా ఆ విషయం దాటేస్తోంది తప్ప నిజం చెప్పదు నా తరువాత ఆమె భవిష్యత్ ఎలా వుంటుందో అని భయంగా వుంది స్వాతి పెళ్ళికని పాతికవేలు తీసాను కాని ఆ నాడు ఆమె అలా వెళ్ళి పోవటంతో అది ఖర్చు చేయనేలేదు ఆ డబ్బు అలాగే స్వాతిపేర బ్యాంక్‌లో వుంది అది ఎప్పుడో ఒకప్పుడు స్వాతికే అందచేయి" అని నాతో చెప్పాడు దాని పాస్‌బుక్ నా దగ్గరే వుంది అందరిముందు నీకు చెప్పటం ఇష్టంలేక అనలేదు "

"కానీ అంకుల్ ! నాకేడబ్బు వద్దు నాకేదైనా ఉద్యోగం చూసి పెట్టండి మీ సహాయం మర్చి పోలేను "

"ఆ విషయాలన్ని ఇక నే చూసుకుంటాను ముందు నీ డెలివరీ అయ్యేవరకు మాట్లాడక" అంటూ నన్ను ఆజ్ఞాపించి వాళ్ళింటికి తీసుకెళ్ళారు

ఒక్కసారి నా కెంతోమంది ఆత్మీయులు కన్పించేవాళ్ళు మరొక్కసారి ఆలోచిస్తే ఈ విశాల ప్రపంచంలో నేనెంత ఒంటరిదాన్నో తెలిసేది డాక్టర్ దంపతుల సహాయం వలన నేను అనాధని కాలేదు వారి చల్లని నీడలో నేను 'బాబు'ని ప్రసవించాను

బాబుకి మూడవ నెల వచ్చాక అంకుల్ చూపించిన ఒక ఉద్యోగంలో చేరాను ఆ హాస్పటల్ మరీ పెద్దది కాకపోవటం వలన, నాకు ఆపరేషన్ చేసే అవకాశం పూర్తిగా కోల్పోయాను నా అసంతృప్తి అంకుల్ ముందర బయటపెట్టలేదు అలా అంటే ఆయన 'ఉద్యోగం ఏమి వద్దు












ముందు ఎమ్ ఎస్ లో చేరు' అని బలవంత పెడతారని భయపడ్డాను

బాబులో దివ్యని, కుమార్‌ని చూసుకుంటూ జీవితం నిర్లిప్తంగా గడపటం అలవాటుచేసుకున్నాను

## 18

ఆ తరువాత మీకు తెలిసిన విషయాలే—

డాక్టరంకుల్, కొత్తగా పెట్టిన మీ నర్సింగ్ హోమ్‌లో నా కోసం ప్రయత్నించటం, మీరు ఆదరంతో జాబ్ ఇవ్వటం, హాస్పటల్ వెనకవున్న క్వార్టర్స్‌లో నేను, బాబువచ్చి రెండేళ్ళుగా ఇక్కడే జీవనం ఆరంభించటం — ఇవన్నీ మీకు తెలిసిన విషయాలే డాక్టర్!

"అంతా బాగానేవుంది ఇంతకీ నీ రిజిగ్నేషన్ ఎందుకో నా కిప్పటికి అర్థం కాలేదు" అన్నారు రుక్మిణీదేవి

స్వాతికా క్షణంలో నిజం ఎలా చెప్పాలో అర్థం కాలేదు నిజానికి చల్లని నీడని వదిలి మండు టెండల్లో పరుగెత్తాలని ఏ మనిషి అనుకోరు ఈ ఉద్యోగం వదిలేస్తే ఇంకోటి అంత త్వరగా దొరుకు తుందన్న నమ్మకములేదు కాని కాని ఎవరి నీడనైతే తనిప్పుడు ద్వేషిస్తోందో అతని నర్సింగ్ హోమ్‌లో అతని డబ్బు తింటూ పనిచేయటం అసాధ్యం

ఆ రోజు చేయవలసిన ఆపరేషన్ ఒకటి వుండి తను త్వరగా రౌండ్స్ పూర్తిచేసుకుని ఆపరేషన్ థియేటర్ ముందుకొచ్చింది అప్పుడే రూమ్‌నుండి బయటకు వెళుతున్న మోహన్ తనను చూసి ఆగాడు ఆతను, తను కలిసి చేయవలసిన ఆపరేషన్ అది ఆ హాస్పెటల్‌లో అతను సీనియర్ సర్జన్!

"అదేం మీరు వెళ్ళిపోతున్నారు" అని అడిగింది తను

ఈ రోజు మీతో ఆపరేషన్ నేను చేయటం లేదు నిన్ననే ఇరాక్‌నుండి వచ్చారుకదా ఈ నర్సింగ్ హోమ్ మానేజింగ్ ట్రస్టీ ఒకరు, ఆయన మంచి సర్జనట, ఆయన చేస్తున్నారు" అని చెప్పి ఆతను వెళ్ళిపోయాడు

రెండు రోజుల క్రితం ఆ వచ్చినాయనకి హాస్పెటల్ గ్రాండ్‌గా పెద్దవిందు ఏర్పాటు చేసింది కాని ఆ రోజు బాబుకి వున్నట్టుండి జ్వరం రావటంతో తను వాడినిచూసుకుంటూ ఇంట్లోనేవుండిపోయింది

తను గ్లౌసెస్, వైట్‌కోటు ధరించి రెడీ అయింది నర్స్ స్టెరియలైజ్ చేసిన యాపరేటస్ ట్రేలో అమర్చ సాగింది పేషెంట్ ఆపరేషన్ టేబుల్‌మీద పడుకొని వున్నాడు

ఇంతలో టకటక లాడించుకుంటూ గ్రే కలర్ పాంట్, వైట్ షర్ట్‌తో వచ్చాడు కుమార్ షుమారు మూడేళ్ళ తరువాత కుమార్‌ని మొదటిసారిగా కలుసుకున్నప్పటి సన్నివేశం అది తన కళ్ళల్లో ఆశ్చర్యం, కోపం — అతని కళ్ళలో ప్రశాంతత, మామూలు చిలిపితనం ఒక్కసారి దెబ్బలాడుకున్నాయి

అతను ఇవేవి పట్టించుకోకుండా పేషెంట్ దగ్గరకు నడిచాడు తను మాత్రం మామూలుగా ఎప్పుడు చూపించే ఉత్సాహం చూపించలేకపోయింది అతను చెప్పిన పనల్లా యాంత్రికంగా చేసేస్తోంది తను ఒకప్పుడు అతని పర్యవేక్షణలో ఆపరేషన్ చెయ్యాలని కలలు కంది ఇప్పుడదే జరుగుతున్న ఆనందం బదులు అశాంతి కలుగుతోంది ఎప్పుడు ఈ ఆపరేషన్ ముగిసి తను రూమ్‌కి పారిపోదామా అని వుంది ఎక్కడో బ్లడ్ వెసల్ చిట్లి రక్తం ప్రవహించబోతోంది

"యూ షుడ్ బి యటన్ టివ్!" అంటూ కుమార్ మందలించి చాకచక్యంగా బ్లీడింగ్ ఆపాడు

ఆపరేషన్ ముగిసాక, అమ్మయ్య అని నిట్టూర్పి బయట పడింది భోజనానికి ఇంటికి రాబోతుండగా శారద ఎదురుపడింది యూనిఫామ్‌లో! శారద నర్స్ ట్రైనింగ్ అయ్యాక తనే రుక్మిణీదేవితో చెప్పి, ఉద్యోగం ఇప్పించింది శారద వచ్చాక, తన ఒంటరితనం చాలావరకు తగ్గింది తీరుబడి దొరికినప్పుడల్లా తామిద్దరూ కలిసి గడపటంతో శారదక్కూడ తన దగ్గర బెరుకుతగ్గి చనువు హెచ్చింది

"ఏమిటక్కా! ఏదైనా సీరియస్ కేస్ అటెండెయ్యావా! మొహం వాడివుంది ?"

"లేదు శారద ఆపరేషన్ చేసివస్తున్నా! డే డ్యూటీయా ఈ రోజు ?"

"ఔనక్కా!" అంటూ శారద వెళ్ళిపోయింది

శారదకు తమ విషయం అంతగా తెలియదు తనెప్పుడు ఆమెతో చెప్పలేదు

ఆ రోజు అంతా విపరీతంగా చికాగ్గా, ఏం చేయాలో తెలియక అయోమయంతో గడిపింది కుమార్ దగ్గర పని చేయటం తనకే మాత్రం ఇష్టంలేదు మరొక ఉద్యోగం చూసుకోక తప్పదు కాస్త ఆలస్యం అయినా ఫరవాలేదు— అనుకొని రిజిగ్నేషన్ వ్రాసి రుక్మిణీదేవి దగ్గరకొచ్చింది ఆమె నిర్బంధించటం వలన ఆ రాత్రి బాబుతో సహా అక్కడే భోజనంచేసి ఆమె తన గాథన్ని విన్పించమని మరీ మరీ ప్రాధేయపడటం వలన తను మనసు విప్పి అంతా ఆమె ముందు పరచటం –

ఇంతలో రుక్మిణీదేవి స్వాతి ఆలోచనల్లో పడటం గమనించి, కిటికి కర్టెన్స్ ప్రక్కకి నెట్ట టానికి లేచారు వేకువ ఝామున తొలివెలుగు మెల్లగా గదిలో ప్రవేశిస్తోంది పక్షులు గూళ్ళనుంచి రెక్కలు టపటప కొట్టుకుంటూ, అరుచుకుంటూ బయటపడుతున్నాయి

"అబ్బ అప్పడే తెల్లవారిందా!" అంది స్వాతి

"బహుశ ఇంకా రెండుగంటల్లో పూర్తిగా తెల్లవారవచ్చు బాబు ఎలాగు నిద్రపోతున్నాడు కాబట్టి నువ్వు కొంచెంసేపు వుండు స్వాతి నేను నీతో కొన్నివిషయాలు చెప్పాలి చెప్పాక నీ రిజిగ్నేషన్ విషయం ఆలోచిద్దాం స్వాతీ! నేను ఇరాక్ నుండి ఇండియా వచ్చేయ్యటానికి ఒక రెండు నెలల ముందర కుమార్‌తో నాకు పరిచయం అయింది ఒకసారి మా ఫ్రెండ్ వుందని 'బాసురా' వెళ్ళాను అక్కడ కుమార్‌తో నాకు పరిచయం కలిగింది వయసురీత్య అతనికంటే చాలా పెద్దదాన్ని అవటం వలన అతన్ని చూసినప్పుడల్లా నాకు ఎందుకో తెలియని పుత్రవాత్సల్యం కలిగేది! కుమార్ కూడా చనువుగా నాతో అన్ని విషయాలు మాట్లాడేవాడు ఒకసారి ఆతని ఆహ్వానంమీద వాళ్ళింటికి వెళ్ళాను అప్పటివరకు బ్రహ్మచారి అనుకున్న నేను, అతని ఒడిలో ఆడుకుంటున్న 'పాప'ని చూసి ఆశ్చర్య పోయాను ఆ తరువాత అతని భార్యకోసం కళ్ళతోనే గాలించాను కాని ఆమె అలికిడి విన్పించలేదు

(ఇంకా వుంది)

# వారఫలం

15-10-1982 శుక్ర వారం మొదలు
21-10-1982 గురు వారం వరకు

మేషం అనుకోని విధాన ధనలబ్ధి, వ్యాపారానుకూల్యత, ఉద్యోగాభివృద్ధికి అవకాశం గల వారం బంధు వర్గీయుల మూలంగా ఏదో మేలు జరుగుతుంది స్త్రీలకు బంధువులతో గోష్ఠి, కొందరకు కళా రంగంలో రాణింపు గలవారం

వృషభం మీతో భాగస్థులుగా ఉండే వారి మూలాన వ్యాపారంలో యిబ్బందు లుంటాయి గత వారానికన్నా అన్ని విధాలా మేలు సమకూడే వారమే చేతికి అందవలసిన డబ్బు అంది తీరుతుంది స్త్రీలకు ఆదాయంలో అభివృద్ధి, ఉద్యోగంలో పెంపు, కొందరకు నూత నోద్యోగ ప్రాప్తి కలదు

మిథునం బంధు వర్గీయుల వలన ఏదో మేలు జరుగుట నిశ్చయం చేయి జారిపోయిన అవకాశాలకు మరలా చైతన్యం సమకూడవచ్చు మిత్రులతో గోష్ఠి రాజకీయంగా మేలు పొందటం సంభవం స్త్రీలకు స్థిర వరాస్తులను గూర్చిన ఆలోచనలు, కించిత్తు ధనలబ్ధికి అవకాశం ఉంటుంది

కర్కాటకం రాజకీయంగా సర్వానుకూలత చేకూర గలవారం అధికారుల వలన మేలు జరుగుటకు అవకాశం గలవారం చాలమందికి, అప్రయత్నంగా ప్రయాణం చెయవలసి రావచ్చు. స్త్రీలకు. గృహానందం, బంధువులు, అతిథి అభ్యాగతుల రాక, నూతన వస్తు సేకరణకు అవకాశం గలవారం

సింహం కళలందు నేర్పు గలవారికి, రంగస్థల, చిత్ర రంగానుభవం గలవారికి సదవకాశాలు ఉంటాయి విలువగల వస్తు సేకరణకు అవకాశం ఉంటుంది స్త్రీలకు అప్రయత్న ధనలబ్ధి, శుభ కార్యాలోచనకు అవకాశం గలవారం

కన్య ఉద్యోగ వృత్తులందు, ఎంత జాగరూకత వహిస్తే అంత మేలు కొందరు చిత్తశుద్ధితో చేసిన ఉద్యోగ ప్రయత్నాలు ఫలితానికి రాగలవు రాజకీయవాదులకు ఉత్తమ ఫలదాయక దినాలు వారమంతా బాగుంటుం దనవచ్చు స్త్రీలకు గృహ విస్తరణకో, వస్తు సేకరణకో అవకాశం గలవారం

తుల మేలున్న వారం అధికారుల ఆదరణ లభించే వారం సుఖశాంతులకు లోపంరాదు అనుకొన్న ప్రకారం పనులు సాగి పోతాయి కొందరకు ఉన్నత స్థాయిలో ఉద్యోగావకాశా లుంటాయి స్త్రీలకు అన్నివిధాలా లాభదాయక వారమే

వృశ్చికం. ధనలబ్ధికి అవకాశం ఉన్నది సమయానికి రావలసిన డబ్బు చేతికి అందుతుంది రాజకీయంగా చాలమందికి అనుకూల వారమే కొందరకు భాగస్తులతో వ్యాపారం బాగా సాగి, భారీ లాభాలు రావడానికి అవకాశం ఉన్నది. స్త్రీలకు వస్తువాహన సముపార్జనకు, నగలు కొనటానికి అవకాశ మున్నది

ధనుస్సు సాధారణ విషయంలో కూడా విలంబన జరిగే అవకాశం గల గ్రహస్థితి, రాజకీయంగా కొందరకు అననుకూలత, కొందరకు అనుకోకుండా ప్రయాణం తగిలే అవకాశం ఉంటుంది

స్త్రీలకు బంధు దర్శనం, మిత్రగోష్ఠి ఉద్యోగాభివృద్ధికి అవకాశం గల వారమే

మకరం నూతన మార్గాల లో ధన సంపాదనకు మార్గాలు ఏర్పడుతాయి అప్రయత్నంగా చాల కాలంగా ప్రయత్నించిన వ్యవహారంలో మేలు కనిపిస్తుంది కోర్టు కచేరీ వ్యవహారాలుంటే విజయం సాధించగలరు. స్త్రీలకు బంధువులను చూడాలనే సన్నాహం, ఉద్యోగ యత్నాలు ఫలితానికి రావటం గమనించ గలరు

కుంభం ప్రసిద్ధులను కలిసికోగలరు ఒకానొక వ్యాపార విషయంలో అనుకూలత సాధించ గలరు మీతో వ్యాపారంలో పోటీపడే వారుంటారు గమనించాలి ఉన్నత పదవుల కొరకు ప్రయత్నించే వారికి మేలు చేకూరే వారమే స్త్రీలకు దూర దేశాన్నుండి ఉత్తరాలు రానున్నాయి రాజకీయంగా కొందరకు మేలున్నది

మీనం మీ ప్రయత్నాలు అన్ని రంగాలలో సుకరంగా సాగిపోగలవు వ్యవహార రంగంలో మీకే విజయం కనిపిస్తుంది ధనలబ్ధికి అవకాశం గలవారం. కొందరకు రాజ కీయంగా మేలు జరుగనున్నది సభా గౌరవానికి కొందరకు అవకాశం లేకపోలేదు స్త్రీలకు రచనా విధానంలో లబ్ధి నూతనోద్యోగాలకు అవకాశం గల వారం గ్రహించాలి

—విద్వాన్ కోట సత్య రంగయ్య శాస్త్రి *




# జాగ్రత్తగా చింపండి
# అందులో వుంది ఒక పూర్తి రూపాయి !

ఇప్పుడు, ప్రతి సింథాల్ సబ్బుతో ఒక మంచి కానుక. రాపర్ లోపలి వేపు 2½ కిలోల అత్యుత్తమ తోమే పౌడర్ క్రొత్త సూపర్ బిజ్ ప్యాక్ కొరకు 1/- రూ. డిస్కౌంట్ కూపన్ వుంది. ఇదిగో, మీరు మెచ్చే సబ్బు మరియు శుభ్రముగా తోమే పౌడర్‌ను చౌకగా కొనే అవకాశం!



# దూరాగతం

## చక్రవర్తి

రామచంద్రం అతని భార్య వినత బృందావన హోటల్లో ఫ్యామిలీ రూంలో కూర్చుని కాఫీ తాగుతున్నారు వినత చాలా చిరాగ్గా వుంది ముఖం ముటముటలాడుతోంది రామచంద్రం నిస్సహాయంగా ఆమె వంక చూస్తూ తన కప్ కాఫీ 'సిప్' చేస్తున్నాడు

సర్వర్ గదిలోనికివచ్చి 'బిల్' యివ్వబోయాడు

రామచంద్రం అతని వంక సూటిగా చూచి 'యింకో రెండు కప్పులు వేడి కాఫీ తీసుకురా బాగా 'బిసి'గా వుండాలి' అన్నాడు సెర్వర్ అతని 'కన్నడం' మాట వాడకానికి నవ్వుకుంటూ బయటకు వెళ్లిపోయాడు

వినత భర్త వంక చూచింది

'అంతే కాఫీ యిచ్చి కాలయాపన చేయాలని చూస్తున్నారు' అంది రామచంద్రం వీపుమీద కొరడాతో కొట్టినట్టు బాధ పడ్డాడు

'ఏం చేయమంటావు వినత నీ మనస్సులో యేం వుందో స్పష్టంగా చెప్పరాదూ, ఇట్లా నన్ను ఏడిపించకపోతే' అన్నాడు

'మరీ అంత బిగ్గరగా మాట్లాడకండి ఎవరేనా వింటారు'

'విన్నా ఫరవాలేదు వాళ్లకు అర్థం కాదు




ఇక్కడంతా 'కన్నడం' ఇంతకూ నువ్వు అనేదేమిటి చెప్పు—'

'హనీమూన్ అంటే ఎంతో ముచ్చట పడ్డాను ఎంతసేపూ పార్కులు హోటళ్లు తప్ప యింకేం చూపించటం లేదు మీరు'

రామచంద్రం ఏమీ బదులు చెప్పలేదు వినత వంక చూస్తూ వుండిపోయాడు— కొన్ని క్షణాలు తను యేం చేస్తే ఆమెకు తృప్తి కలుగుతుందో అతని కేమీ అర్థం కాకుండా పోతోంది

వాళ్లిద్దరికీ పెళ్లి అయి పదిహేను రోజులయింది మూడు నిద్రల తతంగం కాగానే రామచంద్రం 'హనీమూన్' అంటూ ప్రయాణం కట్టించాడు ఉద్యోగానికి రెండు నెలలు సెలవు తీసుకున్నాడు ఈ అరవై రోజులూ దేశమంతా యిష్టం వచ్చినట్లు తిప్పి యేం కావాలంటే అదంతా చూపిస్తానన్నాడు డబ్బు కోసం వెదుక్కోనవసరం లేకుండా ముందే జాగ్రత్త పడ్డాడు

రామచంద్రం ముదిరిపోయిన బ్రహ్మచారి

అయినా బలహీనుడు కాదు మంచి ఉద్యోగం వుంది జీవితంలో యేదో బరువులూ బాధ్యతలు వుండడంవల్ల కాస్త ఆలస్యంగా పెళ్లి చేసుకున్నాడు అంతకంటే యింకేంలేదు వినతను చూచి ప్రేమించి ఆమెచేత కూడా ప్రేమించబడి మరీ పెళ్లి చేసుకున్నాడు పెళ్లికి రెండు నెలలను ముందే ఇద్దరూ సినిమాలకు షికార్లకూ వెళ్లారు ఇద్దరికీ ఇష్టం అయిన మీదటే 'పెళ్లి చేసుకుంటే తప్పకుండా సుఖ పడతాం' అన్న అభిప్రాయం యేర్పడిన తరవాతనే పెళ్లి చేసుకున్నారు

వినత ఎక్కువ చదువుకున్న మనిషి కాదు

స్కూల్ ఫైనల్‌తోనే చదువు ఆపేసింది అన్నగార్లు పెళ్లి చేయలేకపోవడం వల్ల, పదేళ్లపాటు మొగుడి కోసరం కలవరిస్తూ యింట్లోనే కూచుండిపోయింది ఆలస్యం అయినకొద్దీ ఆరాటం ఎక్కువవుతూ వచ్చింది చివరకు రామచంద్రం దొరికిన తర్వాత యింక తన జీవితానికి యేమీ ఫరవాలేదనే ధైర్యం, భరవసా యేర్పడినాయి ఏమీ పనిలేకుండా యింట్లోనే కూర్చుండిపోయింది గనుక ఆ అమ్మాయికి 'హనీమూన్' అంటే ఎన్నోఊహలు— ఆశలు వున్నాయి ఇవన్నీ యేమిటోకూడా వివరంగా ఆమెకు తెలియవు కాని ఏదో జరగాలి ఇన్నాళ్ల నుంచి అనుభవంలోనికి రానిదీ, మనసుకు బాగా 'ఎక్సయిట్' చేసేది ఏదో జరగాలి ఎంతసేపూ తీర్చిదిద్దినట్లున్న రోడ్లూ, అడుగు అడుగుకూ ఎదురయే పచ్చని పార్కులు ఈ 'ఎక్సయిట్‌మెంట్'ను తీర్చడంలేదు ఇంకా యేదో చూడాలి ఏవేవో కలవరింతలు వాటి రూపం యేలా వుంటుందో ఊహకు కూడా అందదు ఈ పరిస్థితిలో ఆమె రాను రాను చికాకు పెంచుకుంటూపోతోంది

రామచంద్రానికి తన మనస్థితి యిదీ అని రకాలున చెప్పలేక ఉక్కిరిబిక్కిరి అవుతోంది రామచంద్రం—పాపం — ఓపికగా భరిస్తున్నాడు

'మైసూరంతా చూచాము నీకు విసుగు అనిపించేదాకా తిప్పాను బృందావనం గార్డెన్స్‌లో యిష్టం వచ్చినట్లు పరుగులు తీశాం వంతెనల మీద ఆడుకున్నాం, చిన్న పిల్లలలాగ ఇప్పుడు బెంగుళూరు చూడడం మొదలుపెట్టాం 'లాల్ బాగ్' అంతా తిరిగామా? కబ్బన్‌పార్కులో మన కళ్ల పడని గడ్డిమొక్క లేదు ఇంకా రెండునెలలు పైముంది నీకు యేం కావాలంటే అది చూడవచ్చును నీ మనసులో యేముందో చెప్పు? ఊరికే చిరాకు పడకు నేనూ చిరాకు పడడం ప్రారంభిస్తే మన 'హనీమూన్' అంతా నాశనం అయిపోతుంది—' అన్నాడు రామచంద్రం, ఆమె చేతిని తన చేతుల్లోకి తీసుకుంటూ

వినత నింపాదిగా వింది 'నిజమే' అనుకుంది కూడా

రామచంద్రం చేతులు ఆమె భుజంమీద పడి కిందకు జారుతున్నాయి

'ఉస్ సర్వర్ వస్తాడు—'

రానే వచ్చాడు పొగలు కక్కుతున్న కాఫీకప్పులు రెండు వాళ్ల ముందు ఉంచాడు ఎక్కువ సేపు అక్కడ తారట్లాడకుండా బయటకు పోయాడు

రామచంద్రం ఆమె వొళ్లో చేయి వేశాడు

'నీకేం కావాలో చెప్పు వినత !' అన్నాడు— లాలనగా

వినత అతనికి దగ్గరగ జరిగి కుడిబుగ్గ ముద్దు పెట్టుకుంది

ఆవేశంతో-- మాట్లాడలేక పోతోంది అనుకున్నాడు రామచంద్రం

'బెంగుళూరంతా తిరగడం అయినాక—శ్రావణ బెళగూళ తీసుకు వెడతాను అక్కడ జైన స్తూపాలు వున్నాయి గోమతేశ్వరస్వామి దేవాలయం ' అంటూ యింకా యేమేమో చెబుతున్నాడు వినతకు పిక్చర్ పోస్ట్‌కార్డ్సులో 'దిశమొల' విగ్రహం మనసుకు వచ్చింది బుగ్గలు ఎరుపెక్కినాయి రామచంద్రం లోకి మరింతగా వొరిగి పోయింది

ఇద్దరూ కాఫీ తాగారు

'ఏదయినా సినిమాకు వెడదామా?' అన్నాడు రామచంద్రం వెంటనే 'రూం'కు వెళ్లిపోదామని చెబితే ఆమెకు కోపం వస్తుందని బాగా తెలుసు తనకు 'మామూలు సినిమాలు వద్దు అక్కడా పార్కులూ, పరుగులు తీయడాలేగా—' అంది వినత

రామచంద్రం ఆమెవంక తీరుబడిగా చూచాడు అతని మనసులోకి ఒక ఆలోచన వచ్చింది ఆమెతో చెప్పకుండా ఆమెను అక్కడకు తీసుకువెళ్లాలి చూద్దాం — యేం చేస్తుందో — అనుకున్నాడు

ఆమెను యిదివరకే 'బార్'కు తీసుకువెళ్లాలని ఆలోచన వచ్చింది అతనికి ముందుగా ఆమెతో చెప్పాడు ఆమె అంగీకరించలేదు తను తాగనన్నది కాక రామచంద్రం కూడా ఒక్క చుక్కయినా పుచ్చుకోవటానికి వీలులేదని ఖచ్చితంగా చెప్పేసింది అందువల్ల రామచంద్రం జీవితంలో యింతవరకూ అప్పుడప్పుడూ అనుభవిస్తూ వచ్చిన 'థ్రిల్' కూడా అతనికి లేకుండాపోయింది అందుచేతనే ముందుగా చెప్పకుండా యిప్పుడు తన మనసులోకి వచ్చిన ఆలోచనను కొనసాగించాలనుకున్నాడు

'నేను లేకుండా వుంటే, మీరు బాగా విచ్చలవిడిగా తిరిగేవారు కదూ బెంగుళూరంతా ? ఇప్పుడు మీకు నేను గుదిబండనయినట్లున్నాను' అంది, వినత అతను యింతసేపూ యేం ఆలోచిస్తున్నాడో అర్థంకాక

'అలాంటి మాటలు అంటే నీకు సంతోషమా, వినతా ? నా మనసు నీకు తెలియదా ?' కసిగా ఆమె భుజం నొక్కుతూ అన్నాడు

'మరి యేమిటి ఆలోచిస్తున్నారు ? ఇదివరకు బెంగుళూరు లనేకసార్లు వచ్చానన్నారుగదూ ! ఎక్కడ యేం వుంటుందో మీకు తెలియదా ? ఏది ముఖ్యంగాచూడాలో మీకు తెలియకుండా వుంటుందా? నా ముందు అమాయకత్వం నటించాలని ఎందుకు తాపత్రయ పడతారు ?'

ఆమె ఉద్దేశ్యం యేమిటో అతనికి అర్థం కాలేదు ఒక్కక్షణంలో వున్నట్లు మరుక్షణంలో వుండదు — ఆమె ప్రకృతి

'మరి పద నిన్ను కాబెరేకు తీసుకు వెడతాను' అన్నాడు ఉన్నట్లుండి

'దిసిమొలల డ్యాన్సులు చూడటానికా? నాకేం అక్కర్లేదు '

'జపాను పిల్లలు మనదేశం వాళ్లుకాదు '

'ఏం వొద్దులెండి పొట్టిగా గున్నఏనుగులలా వుంటారు ఒంటిలో కండతప్ప యింకేం వుండదు బాడీతో డ్యాన్సులుచేసి చివరకు అదీ విప్పి ఎడేస్తారు నాకు అసహ్యం—' అంది వినత

అతనికి చిరాకు కలిగింది ఆమెను సుఖపెట్టాలని ఎంత డబ్బు ఖర్చు చేస్తున్నాడు తను! ఇదంతా ఎందుకూ పనికి రాకుండా పోతోంది

రామచంద్రం యేదో నిశ్చయించుకున్నవాడి మోస్తరుగా ముఖం పెట్టి 'నువ్వు యిక్కడే కూర్చుని వుండు ఇప్పుడే వస్తాను—' అంటూ ఆమె అనుమతి కోసం ఎదురు చూడకుండా గదిలోంచి వెళ్లిపోయాడు వినత అతను వెళ్లిన వెనకనే చూస్తూ ముసిముసిగా నవ్వుతుంది ఈమారు అతను యేదో చేసేట్లే వున్నాడు ఏం చేస్తాడో చూడాలి— అనుకుంది !

రామచంద్రం హోటలు దాటి బయటకు వచ్చాడు

మహాత్మాగాంధీ రోడ్డుమీద రకరకాల నియాన్ బల్బులు వెలిగిపోతున్నాయి రోడ్డు క్రాస్ చేసి అవతలకు వెళ్లాడు ఎవరో మధ్య వయసు అతను అడ్డం వచ్చాడు 'సర్' అన్నాడు ఏమిటన్నట్లు చూచాడు రామచంద్రం

'అమ్మాయిలు కావాలా సార్?'

'అక్కర్లేదు నేను ఫేమిలీతోనే వచ్చాను '

'పోని అబ్బాయిలు ?'

'ఉహూ—'

'ఫ్రెంచి ఫిల్ములు మంచివి వున్నాయి-- చూస్తారా?'

## ప. జర్మనీలో రాట్నంపై నూలు !

పశ్చిమ జర్మనీవంటి ప్రముఖ పారిశ్రామిక దేశంలో ప్రజలు మళ్లీ రాట్నాలపై నూలు వడకడం ప్రారంభించారు కృత్రిమ వాతావరణానికి, ఫ్యాక్టరీల దుస్తులకు అలవాటుపడిన ప్రజల్లో మార్పేదో సంభవించి చేనేత ఉత్పత్తులను వాడడం ప్రారంభించారు ముడినూలుతో అల్లిన స్వెట్టర్లకు గిరాకీ ఏర్పడుతున్నది రాట్నంపై నూలు ఒడకటం చాలామందికి హాబీగా మారింది పగలంతా ఫ్యాక్టరీలలో కష్టపడి పనిచేసిన ప్రజలకు యిది గొప్ప మార్పుగా కన్పిస్తున్నది ఈ ఉద్యమం ఇప్పట్లో ఆగిపోయే సూచనలు కూడా లేవు దేశం పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన తరువాత కుటీర పరిశ్రమలు బాగా దెబ్బతిన్నాయి అవి ఇప్పుడిప్పుడే మరల చిగురిస్తున్నాయి

రామచంద్రం ఒక్క క్షణం ఆలోచించాడు 'ఎంత?' అని అడిగాడు

'మనిషికి యాభై '

ఇద్దరూ రోడ్డు వారకు వెళ్లి బేరంలోకి దిగారు

'ఇక్కడనుంచి టాక్సీలో వెళ్లాలి మూడు మైళ్లు మొత్తం అంతా గంట లోపులో అయిపోతుంది యాభయి యేమీ ఎక్కువ కాదు నిజంగా బొమ్మలు చూచాక మీరే మరో యాభై యిస్తారు అంత బాగా వుంటాయి—' అన్నాడు ఆ మనిషి

'అదంతా నాకు తెలుసు కరెక్టు బేరం చెప్పు ఊరికే ఆలస్యం చేయకు' అన్నాడు రామచంద్రం

'అయ్యా ! యిందులో నాకు వొచ్చేది అయిదు రూపాయిలు కావాలంటే మీరే స్టూడియో అతనితో బేరం చేసుకోండి నేను టాక్సీలోవచ్చి చూపిస్తాను

ఇన్నిసార్లు బేరం చేస్తూ కూచోవడం ఇష్టంలేదు అందులోనూ వినత ముందు యిలా బేరాలు చేస్తుంటే ఆమె యేమనుకుంటుంది, తన గురించి?

'మిస్టర్ ఊరికే కాలయాపన చేయకు ఇద్దరం వచ్చి చూస్తాము అన్ని ఖర్చులు కలుపుకొని డెబ్బయి రూపాయలు తీసుకో ''

అతను అయిష్టంగానే నసుగుతూ, కనీసం అట్లా నటిస్తూ, అంగీకరించాడు

'అమ్మగారిని తీసుకురండి నేను గుమ్మం ముందుకు టాక్సీ తీసుకువస్తాను' అంటూ పరుగు తీశాడు అతను

రామచంద్రం హోటల్‌లోకి వచ్చి వినతను బయలుదేరమన్నాడు

'ఎక్కడికి ?'

'ఉష్ ! అట్లా అడగకూడదు అంతా రహస్యం' అంటూ ఆమె బుగ్గ గిల్లాడు

'బుగ్గ గిల్లగానే సరిపోయిందా —' అంటూ హమ్ చేసింది వినత పాట ధోరణిలో

'సరిపోలేదూ ?' అంటూనే రామచంద్రం ఆమె చేయి పట్టుకుని గబగబ హోటలులోంచి రోడ్డుమీదకు లాక్కువచ్చాడు

టాక్సీ రెడీగావుంది 'అతను' కిందకు దిగి డోర్‌తీసి రోడ్డువారగా నిలుచున్నాడు

'రా, వినతా' అంటూ రామచంద్రం ముందు ఆమెను వెనుక సీట్లో కూర్చోబెట్టి తను పక్కనే కూర్చున్నాడు

'అతను' తలుపు బలంగావేసి ముందు డ్రైవర్ పక్కన కూర్చున్నాడు కారు బయలుదేరింది

'ఎక్కడికో చెప్పరూ ?' అంది గోముగా వినత, రామచంద్రం చెవిలో నోరు పెడుతూ

రామచంద్రం ఆమెను భుజం కిందుగా నొక్కేస్తూ 'నువ్వే చూద్దువుగాని' అన్నాడు

వినత కళ్లలో ఆశ్చర్యం, కొద్దిగా తృప్తి అమరినాయి

భర్తవంక అనునయంగా ప్రీతిగా చూసింది

రేర్‌వ్యూ మిర్రర్‌లోంచి డ్రైవర్ చూస్తున్నాడేమో అన్న యోచన లేకుండా రామచంద్రంచేతుల్ని తన చేతుల్లోకి తీసుకుని ముద్దు పెట్టుకుంది అతని చేతులు ఆమె చేతుల్లో ఆగలేదు

'అంత ఆత్రం పనికిరాదు మనం భార్యాభర్తలం ' అంది వినత, అతని చెవిలో

రామచంద్రానికి ఆ మాటకు కాస్త సిగ్గు

అనిపించింది ఎట్లాగయినా వినత దగ్గర పెద్ద మనిషి తరహా వుంది— అనుకున్నాడు కాస్త దూరంగా జరిగి కూర్చున్నాడు

టాక్సీ ఎటో వెడుతోంది బయటకు చూచాడు రామచంద్రం

నగరంలో యే ప్రాంతంలో వున్నారో అతనికి అర్థం కాలేదు

ఓ చిన్న సందులోంచి వెడుతోంది టాక్సీ ఆ సందు చివర ఆగిపోయింది

'అతను' ముందు కిందికి దిగాడు

టాక్సీ బిల్లు చెల్లించి వేశాడు

వెనక 'డోర్' తెరిచి 'దిగండి సార్' అన్నాడు

రామచంద్రం, అతని వెనక వినత టాక్సీలో నుంచి దిగారు

టాక్సీ వెనక్కు వెళ్లిపోయింది టాక్సీ బాగా దూరం వెళ్లి సందు మలుపు తిరిగిపోయిన తర్వాత అతను నాలుగడుగులు ముందుకు వేశాడు ఇద్దరూ అతన్ని అనుసరించారు ఇంకో నాలుగు ఇళ్ల దాటిన తర్వాత ఓ పెంకుటింట్లోకి తీసుకువెళ్లాడు వినత ఆ చిన్న యింటిలోకి అడుగు వేయటానికి జంకుతూంది 'ఏమిటి యిదంతా?' అన్నట్లుగా భర్తవంక చూసింది ఫరవాలేదు నడవు—అన్నాడు అతను

నడకతో నాలుగు అడుగులు వేసిన తర్వాత పెద్ద హాలు వచ్చింది ఎదురుగా పెద్ద స్క్రీన్ నాలుగయిదు సోఫాలు వేసి వున్నాయి అతను ఇద్దర్నీ ఒక సోఫాలో కూర్చోబెట్టి తను లోపలకు వెళ్లాడు

రెండు నిమిషాల్లో మరో వ్యక్తిని తీసుకు వచ్చాడు అతన్ని రామచంద్రానికి పరిచయంచేసి 'మరి నేను సెలవు తీసుకుంటాను నా డబ్బు యిప్పించేయండి—' అన్నాడు రామచంద్రం అతనికి ముందు ఒప్పందం చేసుకున్న ప్రకారం డెబ్భయి రూపాయలూ యిచ్చేశాడు 'అతను' నమస్కారం చేసి వెళ్లిపోయాడు

రామచంద్రం కూర్చున్న చోటనే యిబ్బందిగా కదులుతూ 'యింకా యెవరయినా రావాలా? ప్రారంభం చేస్తారా?' అన్నాడు స్టూడియో ఆసామీని

'ఎవరి కోసరమూ చూడనక్కలేదు ఈ 'షో' మీ కిద్దరికీ ప్రత్యేకం' అంటూ అతను లైట్స్ ఆఫ్ చేశాడు

వినత రామచంద్రానికి దగ్గరగా జరిగి కూర్చుంది ఆమెకు యేం జరగబోతోందో పూర్తిగా అవగాహన అయే లోపుగానే ప్రొజెక్టర్ ఎక్కడ నుంచో పని చేయడం ప్రారంభించింది ముందుగా వున్న తెరమీద వెలుగు పడింది సినిమా బొమ్మలు కనిపించసాగాయి ఆ కనువెలుగులో వినత రామచంద్రం ముఖంలోకి గుచ్చి చూచింది ఆమె ముఖంలో సంతోషం పెల్లుబికి వస్తూ వుండడం రామచంద్రం గమనించాడు

తెరమీద వరుసగా బొమ్మలు వస్తున్నాయి

మొదటి ఫిలిం పూర్తయింది

ఇద్దరమ్మాయిలూ — ఒక ముసలాయన! ఆయనను ఇద్దరు పడుచు అమ్మాయిలూ చీల్చుకు తినేట్లుగా నటించారు పాపం ముసలివాడు యిద్దరి మధ్య ఉక్కిరి బిక్కిరి అయిపోతూ వున్నాడు అమ్మాయిలు అతన్ని పోటీ పడినట్లుగా తమ వయిపు లాక్కుంటున్నారు అతను బొమ్మ మాదిరి యెవరి 'లాగుడు' యెక్కువయితే అటు ఊగుతున్నాడు వినత నవ్వు ఆపుకోలేకపోయింది

'బాగుందా?' అని అడిగాడు రామచంద్రం

'తమాషాగా వుంది ఇంకా ఎన్ని ఫిలింలు చూపిస్తారు?'

'యింకో రెండు'

'డెబ్భయి రూపాయలా? చాల దండుగ మీకు డబ్బు విలువ యేమీ తెలియడంలేదు'

'పోనిద్దూ యిక్కడ కూడా డబ్బు గొడవేనా? నీకు ఎక్సయిట్‌మెంట్ కావాలి అందుకోసం ముందు చెప్పకుండా తీసుకువచ్చాను'

'మీరు యిలాంటివి చాలా చూచేవారా? యిది వరకు'

'ఎప్పుడూ చూడలేదు ఇప్పుడు నీ కోసం చూస్తున్నాను' అన్నాడు రామచంద్రం, నమ్మమన్నట్లు ఆమె ముఖంలోకి దీనంగా చూస్తూ

రెండో ఫిలిం మొదలయింది

వినత ఉత్సాహంగా ముందుకు జరిగి చూస్తోంది

రామచంద్రానికి మనసులో ఆనందంగా వుంది ఈ పూటకు 'వినత'ను 'మూడ్'లోకి తీసుకురాగలిగినందుకు అతనికి ఎంతో ఉత్సాహంగా వుంది

తెరమీద బొమ్మలు వస్తున్నాయి

ఓ యువకుడు — అతని ముఖం కనిపించడం లేదు, నెత్తిమీద టోపీవల్ల అదీకాక 'క్లోజప్' యివ్వడంలేదు — అతనికి కెమెరామన్

రోడ్డుమీద నడుస్తున్నాడు యువకుడు వడివడిగా నడుస్తున్న అతని కాళ్లను మాత్రమే చూపుతోంది కెమెరా దారిలో ఒక అమ్మాయిని కలుసుకున్నాడు ఆమెతోపాటు ఆమె గదికి వెళ్లాడు ఇద్దరూ పద్ధుచుదనంలో వున్నారు ఒకళ్లనొకళ్లు ఆలింగనం చేసుకోవడంలోను, ముద్దులుపెట్టుకోవడంలోను మునిగిపోయారు కొంతసేపు అంతా సరదాగా వుంది ఎన్నోఫోజుల్లో కౌగలింతలు, చుంబనాలు — వినతకు ఎంతో ఉత్సాహంగావుంది ఆమె చేతుల కదలికవల్ల ఈ విషయం తేలికగా అర్థం చేసుకుంటున్నాడు రామచంద్రం ఆమె ముఖం వివరంగా చూపిస్తున్నాడు యిప్పుడు తెరమీద రామచంద్రానికి అనిపించింది, ఈ ముఖాన్ని యిది వరకు ఎక్కడో చూచానని దాదాపు యిరవయి సంవత్సరాల క్రితం! పాత జ్ఞాపకాలు అతడి మెదడులో కదలబారుతున్నాయి టెలిఫోన్‌మీద బొమ్మ పెద్దమంచంమీద డన్‌లప్ పరుపు అద్దాలు, అలంకారాలు ఆ అమ్మాయి తన దుస్తులు తీసేస్తోంది ఒక్కొక్కటే జాగ్రత్తగా మడతపెట్టి పక్కనున్న టేబుల్‌మీద పడేస్తోంది తరువాత పక్క సరిచేయడానికి అటూ యిటూ వంగుతోంది ఆమె ప్రతి కదలికలోను శరీరంలోని వంపులు మరింత స్పష్టంగా కనిపిస్తూ కితకితలు పెడుతున్నాయి నోరు వూరిస్తున్నాయి యువకుడికి తన వంపులన్నీ చూపించాలని ఆమె ప్రయత్నం చేస్తున్నట్లుంది యువకుడు మాత్రం తన ముఖాన్ని కెమెరాకు అడ్డంగా తిప్పి నిలబడ్డాడు ఆమె అతని దుస్తులు విప్పడంలో కూడా సహకరిస్తోంది బనీను విప్పి వీపు నిమురుతోంది అతని వీపుమీద — కుడి భుజంపైని పెద్ద పుట్టుమచ్చ అప్పటికిగాని రామచంద్రానికి ఆ సన్నివేశం యేమిటో గుర్తుకు రాలేదు కళవెళపడ్డాడు

వినత అంటోంది — 'ఈ విచ్చలవిడిగా తిరిగే మనుషులు యెక్కడ దొరుకుతారో వీళ్లకు?'

'మరీ బూతుగావుంది ఆమె పక్కా వ్యభిచారిణి అయివుండాలి లేకపోతే యింత ప్రదర్శనకు వొప్పుకోదు పరమబోకు— అనుకుంటాను'

— మళ్లీ వెంటనే యేదో గుర్తు తెచ్చుకుని యిబ్బందిగా ముందుకు జరిగాడు

'మరీ చెత్తగా వుంది యింక వెళ్లిపోదాం పద—' అన్నాడు వినతతో

వినత లేవలేదు 'మీకేమన్నా మతి పోయిందా? ఎంత డబ్బు యిచ్చాం—' అంది దృష్టి తెరమీదే వుంచి

తెరమీది అమ్మాయి అతన్ని పూర్తిగా వివస్త్రుడిని చేసింది గట్టిగా కౌగలించుకుంటోంది ఆమెకు ఇరవై సంవత్సరాల కంటే వుండవు

'పోదాం పద ముందు ముందు యింకా పచ్చిగా వుంటుందేమో! చూడలేము పద వినతా' దాదాపు ప్రార్థిస్తున్నట్లుగా అన్నాడు

'ఉహూ—' వినత నిశ్చయంలో ఎటువంటి మార్పు రాలేదు

తెరమీద యువకుడు యింకా వెనక్కి తిరిగే వున్నాడు

ఆమె క్షణం పాటు అతన్ని వదిలి ముందుకు కదిలింది యాదృచ్ఛికంగా అన్నట్లు అతను 'కెమెరా' వంక చూచాడు అతని ముఖం తెరమీద విశాలంగా కనిపిస్తోంది

'భగవాన్!' అంది కెవ్వున వినత

రామచంద్రం నీరసపడిపోయాడు

బాంబు పేలింది ఇంక అతను చేయగలిగింది యేమీ లేదు

'మీరా?' అంది వినత—అతని వంక అసహ్యంగా చూస్తూ

అంత చీకట్లోనూ ఆమె ముఖంలో అసహ్యం కొట్టవచ్చినట్లుగా అగుపిస్తోంది— రామచంద్రానికి

'అవును నేనే యిరవయి యేళ్ల కిందట' అన్నాడు రామచంద్రం అతని గొంతు ఎక్కడో గోతిలోనుంచి— నూతిలోనుంచి వస్తున్నట్లుంది

'ఏమిటీ విపరీతం! అసహ్యం అనిపించటం లేదూ? మీరు చాలా గ్రంధసాంగులన్నమాట!' అంది ఆమె

అతనేమీ జవాబు చెప్పలేదు

'ఎందుకట్లా చేశారు? చెప్పండి అబ్బ నాకు డోకు వచ్చేట్లుగా వుంది మీ ముఖం ఎట్లా చూడను?'

'ఇరవయి యేళ్ల కిందటి మాట వినతా! అందుకనే— యిందాకే వెళ్లిపోదాం అన్నాను నువ్వు వినలేదు,'

'వాళ్లు మీకు బాగా డబ్బు యిచ్చారా?'

'ఆమెకు యిచ్చారు అయిదు వందలు ఆమెకు అత్యవసరంగా డబ్బు కావలసి వచ్చింది అందుకని

భార్య గదమాయింపు ధోరణికి కేశవరావుగారికి తట్టుగాలి రేక్కొస్తోంది.

"నీ ప్లీడరు సవాళ్లు తగ్గించి ఏంకాని పని చేశారని వాళ్లని పొమ్మన మంటావో చెప్పు కామేశ్వరీ!

కాస్త వెనక్కి తిరిగిచూడు. ఒకప్పుడు నీ కొడుకు ఒక అమాయకురాలి శీలంతో ఆటలాడి నప్పుడూ, మొగ్గలోనే ఆ పిల్ల జీవితం రాలి పోయేందుకు కారణమయినప్పుడూ కూడా వాణ్ణి వెనకేసుకు వచ్చావు, కడుపులో పెట్టుకోవాలన్నావు. మనస్సు సమ్మతించకపోయినా, అన్యాయమని ఆత్మ ఘోషిస్తున్నా కాదనలేక దుర్బలుణ్ణయ్యాను.

బ్రతుకునే కాంతివంతం చేయగల మాణిక్యం లాంటి చిన్నది కోరి మనకొంపలో కాలు మోప బోతుంటే కాలడ్డంపెట్టి పెడమొహం చేసినప్పుడూ వాణ్ణే సపోర్టు చేశావు. వాడికి కొమ్ములొచ్చేలా చేశేవు. మనస్సు విలవిల్లాడినా మీ ఖర్మానికొదిలేసి వూరుకున్నాను.

నా కొడుకు అన్న మమకారంతో మహా మహా తప్పుడు పనులు చేసినప్పుడే సమర్ధించి ఇంట్లో చోటిచ్చిన వాణ్ణి — ఈనాడు వాడు బుద్ధిమంతనంగా పెళ్లాడి బిడ్డాపాపతో గుమ్మంలోకి వస్తే గెంటెయ్యమంటావా ? నా వల్లకాదా పని. నా వారసులు వాళ్లే. వాళ్లు ఇక్కడే వుంటారు. ఇక అమ్మాయి భవిష్యత్తు మనకు బాధాకరం అవదా అంటావే. హు ! ఏ తల్లిదండ్రుల ఉసురో మనకు తగిలి వుంటుంది. ఈ జన్మలో చేసిన పాపానికి ఈ జన్మలోనే పరిహారం చెల్లించాల్సి రావటమంత అభిలషణీయమైన విషయం మరోటి లేదు. తప్పదు. అనుభవించుదాం"

కేశవరావుగారు స్థిరకంఠంతో చెప్పేసి ఇహ నక్కడ వుండకుండా లేచి వెళ్లిపోయేరు.

కళ్ళు అప్పగించి అచేతనంగా వుండిపోయింది కామేశ్వరమ్మ.

* * *

అనాలోచితంగానో ఆటకాయితనంగానో విసిరినా నిప్పురవ్వ తన పని మానదు. రాజుకుని మంటలురేపి సర్వం దహించుతుంది.

తను చేసిన పని పీటలమీద పెళ్లి చెడిపి, ఎందరి మనస్తాపానికి కారణమయిందో గుర్తించేక నాలుక కొరుక్కున్నాడు పార్వతీశం

ఇంత విషమిస్తుందనుకోలేదతను. ఏదో కాస్సేపు వాళ్లూ వీళ్లూ గలాటాపడతారు. ఇంకో పాతికవేలు కట్నం జరిమానా వేస్తారు. దాంతో అంతా సర్దుకుంటుంది అనుకున్నాడు.

ధనమదంతో విర్రవీగుతూ చుట్టాల్ని పిపీలికాల మోస్తరు చూసే కామేశ్వరమ్మ చెమటలు కక్కుతూంటే చూసి ఆనందిద్దామనుకున్నాడు.

అంతేకానీ ఇలా పరిణమిస్తుందనుకోలేదు.

ఎవ్వరేమనకపోయినా ఎవరి ఎదురుగుండానూ వచ్చేందుకు ధైర్యం చాలక గుట్టుచప్పుడు కాకుండా తన సామాన్లు సర్దుకున్నాడు పార్వతీశం.

అందరికన్న తీవ్రాఘాతం తగిలింది వసంతకి.

రెండ్రోజుల్లో తన సర్వస్వం కాబోతున్నాడను కుంటున్న గోపీకృష్ణ తనకిక ఎప్పటికీ ఏమీ కాబోడన్న వార్త నామె జీర్ణం చేసుకోలేకపోతోంది. రూఢిగా




డాక్టర్ కె. వెంకటేశ్వరరావు

### జి. పి. — భీమునిపట్నం

నా వయస్సు 16 సంవత్సరములు. నాకు తరచుగా నోటిపూత వస్తుంది ఇక్కడి డాక్టర్ల సలహాపై మాత్రలు వాడినపుడు తగ్గినా మరలా త్వరలోనే వస్తోంది. ఇది శాశ్వతంగా పోవాలంటే ఏమి చెయ్యాలి ?

★ ఇలా అప్పుడప్పుడూ ఎక్కువగా నోటిపూత రావటాన్ని ఆఫ్తస్ స్టొమటైటిస్ అని అంటారు. దీనికి ఎన్నో కారణాలు ఉన్నాయి. కాని ఫలానా అంటూ కారణమేమీ కనుగొనబడలేదు.

మానసిక ఆందోళన దగ్గరనుంచి, బి.కాంప్లెక్స్ లోపంవరకూ చాలా కారణాలు చెప్పబడుతున్నాయి.

ఈ పుండ్లమీద ఒకశాతం సిల్వర్ నైట్రేట్ పైపూతగా వాడి వెంటనే నోటిని ఉప్పునీటితో పుక్కిలించటం మంచిది. ఇలా రోజుకి రెండుసార్లు చేయటం అవసరం. లోనికి బి కాంప్లెక్స్‌మాత్రలు, కామంచి ఆకు రసం, సగ్గుబియ్యం జావ, కొబ్బరి పాలు మొదలగునవి తీసుకోవటంవల్ల త్వరగా ఉపశమనం కలుగుతుంది.

### బి. ఎస్. — కొత్తవలి

నాకు 19 సంవత్సరములు. నాకు ఎక్కువగా చెమట పడుతుంది. పెన్నుతో ఏదైనా వ్రాసేటప్పుడు కాగితం అంతా తడిసిపోతుంది చెమటతో చాలా బాధపడుతున్నాను. దీనికి మీరేమైనా సలహా చెప్ప ప్రార్థన ?

★ పుట్టుకతోనే చర్మంలోని స్వేదగ్రంధులలో కొన్ని మార్పులు ఉండటం వల్ల ఇలా జరిగే అవకాశం ఉంటుంది. కాలక్రమేణా శరీర తత్వంలో మార్పు వచ్చే అవకాశం ఉంటుంది. దీనికిగాను ప్రత్యేక చికిత్స ఏమీలేదు.

### ఎ. ఎ. ఎస్. — మచిలీపట్నం

చర్మ రక్షణకోసం సాధారణంగా మనం ఇళ్ళలో స్నానం చేసేటప్పుడు నీళ్ళల్లో ఏమైనా కలిపితే మంచిదా ?

★ చర్మ రక్షణకోసం నీళ్ళలో ప్రత్యేకంగా ఏ పదార్థమూ కలపనవసరంలేదు. స్నానం చేయటానికి వాడే నీళ్ళు కలుషితంగాకుండా చూసుకోవటం అవసరం. సబ్బు నురుగు వచ్చేవిధంగా నీరు "సాఫ్ట్"గా ఉండటం కూడా అవసరమే కొందరు అతిజాగ్రత్తగా ఉండటానికి డెట్టాల్ వంటి మందులను నీళ్ళలో కలపటం జరుగుతున్నది కానీ అలా కలపబడే మోతాదు వాసన మాత్రం కలిగిస్తుందే తప్ప క్రిమి సంహారానికి సరిపోదని తెలియజేయవలసి ఉంటుంది.

### ఎమ్ వి బి — కొమ్మంగిరిపట్నం

మా అన్నయ్య మేనరికం చేసుకున్నాడు వారి రెండవ అమ్మాయికి ఇప్పుడు 9 సంవత్సరములు పొట్టిగా బలంగా వుంటుంది. కొద్దిగా మందకొడిగా వుంటుంది వయస్సుకి తగినట్లుగా ఎదగలేదు చురుకులేదు అన్నదే వారి దిగులు ?

★ మేనరికం చేసుకోవటం వల్ల పుట్టుకతోనే శరీర తత్వంలో కొన్ని మార్పులు వచ్చే అవకాశం ఉన్నది. అలా అని మేనరికం చేసుకొన్న ప్రతివారికి అలా జరుగుతుందని కాదు.

కాలగతిలో మీ అన్నగారి కుమార్తెకి చురుకుదనం రావచ్చును. శరీర భౌతిక మానసిక పెరుగుదల మేనరికం చేసుకొన్న తల్లితండ్రుల పిల్లలకన్న, అలా చేసుకోనివారి పిల్లలలో ఎక్కువ అని శాస్త్ర రీత్యా అంగీకరింపబడిన విషయం. ●

---

అంతా నిర్ణయిస్తూన్న ఆ నిజాన్ని విని ఆమె తట్టుకోలేకపోతోంది.

మిడిసిపడుతున్న సూర్యుడు అకస్మాత్తుగా కళ తప్పినట్టు, అకాలంగా మబ్బులు కమ్ముకొచ్చినట్టు, ఒక్కమాటుగా చీకట్లు ముసురుకొచ్చినట్టు ఏమిటేమిటో అనుభూతులు కలిగి మతి పోగొడుతున్నాయి.

ముగ్ధయైన ఆ బాలిక ఈ మూడేళ్లబట్టీ అతని చుట్టూరా ఎన్నో అందమైన ఊహాలు పేర్చుకున్నది. ఎన్నెన్నో తియ్యని కలలు కన్నది.

కల్పనలే కావచ్చు. కానీ శృంఖలా బంధంలేని ఆ వూహాలు కలిగించే ఆనందానికేది సాటి ?

వసంత గదిలో ఆమె పడుకునే మంచానికెదురుగా ఒక పెద్ద నిలువుటద్దం వుంది. సమయం దొరికితే చాలు—ఆ మంచంమీద ఒరిగి గోపీకృష్ణతోడి తన భావిని మధుర మధురంగా ఏవేవో ఊహాలు చేసేది వసంత.

ఏ అద్భుత శక్తి అబ్బటం వల్లో మనస్సు సృష్టించే ఈ భావనలన్నీ రూపం దాల్చి ప్రాణం పోసుకుని ఎదురుగా వున్న అద్దంలో ప్రతిఫలిస్తున్నట్టు భావిస్తూ కళ్లార్పకుండా ఆ అద్దం వంకే తన్మయురాలై చూస్తూ వుండేది.

ఏమి కమనీయమైన ఊహాలవి !

తను నిద్రిస్తూ వుంటుంది. సడికాకుండా గోపీకృష్ణ తనని సమీపిస్తాడు. సుందర స్వప్నాలు

## కాలం కరిచాక

కాంచుతూ నిద్రాముద్రితాలైన తన కనురెప్పల పైన పెదవులతో మెత్తని ముద్రవేస్తాడు.

తను ఉలిక్కిపడి కనులు తెరుస్తుంది. మందహాసంతో వంగుతున్న అతన్ని వీక్షిస్తుంది.

సిగ్గుతో మోము పక్కకు తిప్పకోడంలో ఈసారి అధరాన్ని స్పృశింప బోయిన అతని మోవి బుగ్గల్ని చుంబిస్తుంది.

మరొక ఊహ— అతను ఇంటికి ఆలస్యంగా వస్తాడు. అంత వరకూ అతని కొరకు ఉత్కంఠతో ఎదురు తెన్నెలు చూసిన తను అతను కనిపించగానే అలకలు పోతుంది. అతను కారణాలు చెప్పబోతాడు. తను వినిపించుకోదు. పెడ మొహం చేస్తుంది.

తనను ప్రసన్నం చేసుకోను అతడు తహ తహలాడతాడు. కొంటె మాటలతో నవ్వించబోతాడు చిలిపి చేష్టలతో మురిపించ బోతాడు.

అతని లాలనకు తను కరుగుతుంది. అతని వలపు పిలుపుకు తను పలుకుతుంది. అతని మురిపెంపుమాటలకు తనమనస్సు ఉరకలువేస్తుంది.

తన వదనంలో చిరునవ్వుల చిలకరింపులకు అతని డెందం అందలాన్నధిరోహిస్తుంది.

ఇంకొక కల— బాల భానుడి తొలి వెలుగులు విచ్చుకుంటున్న వేళ హిమస్నాత ఐన శ్వేతగులాబిలా తను అభ్యంగనం చేసి ధవళ వస్త్ర ధారిణి అయి కనులు మూసి చేతులు అరమోడ్చి లోక సాక్షికి కైమోడ్పు లందిస్తున్న వేళ తన మేని పయిన విరుల వాన !

ధ్యానం చెదిరి కలవర పాటున రెప్పలు విప్పిన తన ఎదుట తననే పారవశ్యంగాచూస్తూ పారిజాతపు కొమ్మల్ని వూపుతున్న గోపీకృష్ణ !

జలజల రాలుతూ తనని పుష్పాభిషేకంచేస్తున్న పారిజాతాలు. . కుసుమపత్ర మృదు స్పర్శకు పులకితమవుతున్న శరీరం... పులకలు దేరిన దేహాన్ని చుట్టుకున్న అతని బాహువులు...కౌగిలింతల వేడి. హాయి... మత్తు... ఓహ్...

ఇంతలో హృదయపు లోతుల్లోకి చొచ్చుకుపోయిన అతని తలపులు తను మరువగలదా?

మానస పటలంమీద గాఢంగా ముద్రించుకున్న అతని రూపాన్ని చెరిపి వేరొక రూపానికి తావీయగలదా ?

అతను శృతి చేసిన రాగ వీణను పరాయివారికై వశం చేయగలదా ?

వసంత కొన్ని క్షణాలు గోపీకృష్ణ స్మృతిని విడిచి ఆలోచించాలని ప్రయత్నించింది.

ఉహూ. సాధ్యం కాలేదు.

మూడు సంవత్సరాల దీర్ఘ కాలం మనసును అహరహమూ అలరించిన అతని తలపులు తొలగించటం తన వశం కాలేదు. అతని చేరువ కొరకు అర్రులు చాస్తున్న మనస్సు అతను దూరమవటాన్ని భరించలేదు...

(ఇంకా వుంది)

**The dawn in every man's life is touched with the Savage experience.**



# సినిమాతార సింపుల్‌గా ఎందుకుండకూడదు?

షాపింగ్‌కు బయలుదేరబోతున్న గీత, నన్ను చూసి ఆగింది "తొందరేంలేదు షాపింగ్ విషయం తర్వాత చూసుకోవచ్చుగాని, ముందు – అభిమానుల గురించి మీకు చెప్పాలి ఫస్ట్ ప్రిఫరెన్స్ టు ఫాన్స్ దెన్ వోన్లీ షాపింగ్!" కిలకిలా నవ్వుతూ గీత ఇలా చెప్పసాగింది

## పేరుతో తమాషా ఉత్తరాలు

"ప్రియమైన —కు" అని నా పేరుకు బదులు ఓ 'గీత' గీచి ఆమధ్య ఓ ఫాన్ అనకాపల్లి నుంచి ఉత్తరం రాసింది నేను నటించిన ఓ కన్నడ చిత్రం చూసి, బెంగళూరు నుంచి ఓ జ్యోతిష్కుడు "నీ గీత దివ్యంగా ఉందమ్మాయ్!" అంటూ రాశాడు ఇలా నా పేరుతో గారడీలు చేస్తూ కొన్ని తమాషా ఉత్తరాలొచ్చాయి.

## తేడా ఎందుకు తెలియాలి ?

నేను ఎర్రగా ఉండడంవల్ల షూటింగ్ సమయాలలో అట్టే మేకప్ వేసుకోను ఇక, మిగతా సమయాలలో ముఖానికి పౌడర్ కూడా పూసుకోను. నేను చిన్నప్పట్నుంచీ అంతే చాలా నిరాడంబరంగా కనిపించాలని నా మతం నాకెక్కడైనా తారసపడ్డ ఫాన్‌లు 'మీరు సినిమా స్టార్ కదా? కనీసం లిప్‌స్టిక్ అయినా పూసుకోకపోతే ఎలా?' అంటూంటారు ఒకసారి ఓ హోటల్లోని రిసెప్షనిస్టు 'మీరు మరీ సింపుల్‌గా ఉంటే – మామూలు యువతులకూ, మీకూ తేడా ఏం తెలుస్తుంది?' అని అడిగింది 'ఆ తేడా ఎందుకు తెలియాలి? ఏం? నేమ్మాత్రం మామూలు యువతిని కానా?' అని నవ్వుతూ ఎదురు ప్రశ్న వేశాను

## మళ్లీ తన్పించలేదు

మా ఇంటికింకా టెలిఫోన్ రాలేదు అంచేత, ఎప్పుడైనా ఫోన్ చేయవలసివస్తే, దగ్గరున్న ఏ షాప్‌కో, లేక టెలిఫోన్ బూత్‌కో కాలినడకన వెళ్తూంటాను ఓ సినిమా స్టార్ ఇలా పబ్లిక్ టెలిఫోన్ బూత్ నుంచి మాట్లాడ్డం కొందరికి విచిత్రమనిపిస్తుందనుకుంటా ఒకసారి ఒకాయన 'ఏమండీ! మీకు ఫోన్ లేదా?' అని అడిగేశాడు కూడా 'ఎప్పుడో అప్లయ్ చేశాం ఇంకా ఎప్పుడొస్తుందో తెలీదు' అన్నాను "ఐతే, ఆ అప్లికేషన్ నెంబర్ వగైరా వివరాలివ్వండి మీకు ఫోన్ త్వరలోనే వచ్చేటట్లు చూస్తాను," అన్నాడు. నేను తమాషాగా 'నేనీ పబ్లిక్ టెలిఫోన్ బూత్‌కు రావడం మీ కిష్టంలేదా ఏమిటి?' అన్నాను నవ్వుతూనే దాన్ని ఆయన సీరియస్‌గా తీసుకుని, 'అబ్బెబ్బే! ఎంత మాట!' అని చల్లగా జారుకున్నాడు – అంతే ఆ తర్వాత మళ్ళీ ఆయన నాకా టెలిఫోన్ బూత్ ఛాయల్లో కనిపించలేదు

## అధికారం వెనుక ఆప్యాయత

మద్రాసుకు, తిరుపతికి మధ్య పుత్తూరు ఉంది అక్కడ – హీరోయిన్‌గా నాకు మంచి పేరు తెచ్చిన "శ్రీరామ బంటు" చిత్రం ఔట్‌డోర్ షూటింగ్ ఆర్టిస్టులకు, టెక్నీషియన్‌లకు మెస్

'టింగురంగడు'లో గీత





ఏర్పాటు చేశారు రవి చిత్రవారు నేను శాకాహారిని అంచేత, నాకు మాత్రం ఓ వెజిటేరియన్ హోటల్ నుంచి కేరియర్‌లో భోజనం తెప్పించే ఏర్పాటు చేశారు ఓ రోజు మధ్యాహ్నం షూటింగ్ విరామ సమయంలో నేను భోంచేయడం ముగిస్తూండగా ఒక గృహిణి నా దగ్గరగా వచ్చి, 'ఏమిటమ్మాయ్! నీకు మటుకు హోటల్ నుంచి స్పెషలా?' అని కుతూహలంతో అడిగింది నేను శాకాహారినని తెలియజేశా "ఐతే, హోటల్ మెతుకులు గతకాల్సిన ఖర్మ నీకేం పట్టిందమ్మాయ్ ఎండిపోతావు నువ్వేం అనుకోకపోతే – మేమూ శాకాహారులమే ఈ ఊళ్ళో మీ షూటింగ్ ముగిసేవరకు ప్రతిరోజూ రెండు పూటలా మా ఇంటినుంచే నీకు భోజనం పంపిస్తూంటాం కాదనకు!" అంది అధికారయుతంగా ఆ అధికారం వెనుక ఎంత ఆప్యాయత ఉందో! ఇక, ఆ ఊళ్ళో ఆ షూటింగ్ ముగిసి, నేను బయలుదేరే సమయానికి పాపం, ఆ గృహిణి కన్నీళ్ళతో నన్ను సాగనంపింది – తన కూతుర్ని అత్తవారింటికి పంపిస్తున్నంత బాధగా అప్పుడు నా కళ్ళూ చెమ్మగిల్లాయంటే నమ్మండి

## బోధపడని విషయం

నాకో విషయం ఇప్పటికీ అర్థం కావడంలేదు నేను బాగా ఏక్ట్ చేశానన్న కొన్ని చిత్రాలు తమకు నచ్చనట్లు కొందరు అభిమానులు రాస్తూంటారు నాకు నచ్చని చిత్రాలు కొన్ని వాళ్ళకు మహాద్భుతంగా ఉన్నట్లూ రాస్తూంటారు

లోకోభిన్న రుచిః !

[ జి వి. జి ]



# సినిమా విశేషాలు

-జి. వి. జి.

## "బిల్లా — రంగా"లో ఎస్. ఐ సవాల్

బిల్లా (చిరంజీవి) టాక్సీలో వెళ్తున్నాడు ఎస్ ఐ స్వరాజ్యరావ్ (రావి కొండలరావు) జీప్ అడ్డుపడింది

"ఓహో! బాంకి కేడీలా? కుశలమా? డొక్కలో పొడిచానంటే బెక్కులు పెడ్తావ్ బాంకి చోరీ డబ్బెక్కడ దాచావ్? విన్నేరా, బిల్లా!" అన్నాడు ఎస్ ఐ

"బిల్లా కాదు, పులిపిల్ల! మాటలు పారేసుకోకండి, ఇన్‌స్పెక్టర్! దేశం మొత్తం అల్లరై పోయాడు కోర్టులో కేసు నడిచింది శిక్ష పడింది చోరీ డబ్బు దాచుకున్నాడో — తగలేసుకున్నాడో అది బిల్లా స్వవిషయం తమరెళ్లొచ్చు," అన్నాడు బిల్లా

"ఒరేయ్!"

"ఇన్‌స్పెక్టర్!"

"ఒరేయ్! ఎస్ ఐ స్వరాజ్యరావంటే సింహంరా! నా కన్ను కప్పలేవు నిన్ను నీడలా వెంటాడతాను నువ్వు దాచుకున్న చోరీ ధనం నీక్కాకుండా లాక్కుంటాను!"

"ప్రయత్నించండి గుడ్‌లక్!" బిల్లా టాక్సీలో తుర్రుమన్నాడు

ఎస్ ఐ ఏదో ఆలోచిస్తూ తల పంకించి, జీప్‌లో బయలుదేరాడు

కె ఎస్ ఆర్ దాస్ దర్శకత్వంలో పింజల నాగేశ్వరరావు నిర్మించిన పి ఎస్ ఆర్ పిక్చర్స్ "బిల్లా — రంగా" చిత్రం అక్టోబర్ 7న విడుదల చిరంజీవి, మోహన్‌బాబు, త్యాగరాజు, ప్రభాకర్, శ్యామల, స్వప్న తెరముందు — ఆదుర్తి నరసింహమూర్తి, సత్యం, ఎస్ ఎస్ లాల్, కృష్ణకిశోర్ రెడ్డి, ఎస్ వెంకటేశ్వరరావు, కె రామమోహనరావు, బి చలం, పి శివప్రసాద్, మల్లయ్య తెరవెనుక కృషి చేశారు

'ఏకలవ్యలో' కృష్ణ, జయప్రద

## జయప్రద సమర్పించే చిత్రం

"జయ విజయ్ ఎంటర్‌ప్రైసెస్ వారి తొలి చిత్రాన్ని సమర్పిస్తూ, ఒక సరికొత్త పాత్రను ధరిస్తుంది జయప్రద ఆమె సోదరుడు, ఈ చిత్ర నిర్మాత పి రాజ్‌బాబు చురుకైన హీరో పాత్ర ధరిస్తారు ఇంకా కొత్తవాళ్ళు కొందరిని పరిచయం చేస్తాం పూర్తిగా ఔట్‌డోర్‌లో ఈ సోషియో క్రయిమ్ థ్రిల్లర్ తయారౌతుంది," అన్నారు కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వం నిర్వహించే శ్రీనివాసరెడ్డి విజయకుమార్ ఛాయ, గణేశ్ సహకార దర్శకత్వం, సురేష్ నృత్యాలు, డి వెంకటరత్నం కూర్పుతో జగదీశ్ నిర్వహణ బాధ్యతలు వహిస్తారు

## చలం చిత్రం "నారద నాయుడు"

"సంపూర్ణ వినోదాత్మక చిత్రం కె బాలచందర్ గారి 'మణల్ కయిర్' తమిళ హిట్ చిత్రం ఆధారంగా నిర్మిస్తున్నాను సెప్టెంబర్‌లో పాటలు రికార్డు చేసి, నవంబర్‌లో షూటింగ్ మొదలెడ్తున్నాను," అన్నారు చలం ఈయన రేలంగి నరసింహారావు దర్శకత్వంలో నిర్మించే "నారద నాయుడు" చిత్రానికి రాజశ్రీ రచన, సంగీతం నిర్వహిస్తున్నారు సంక్రాంతి విడుదల వచ్చే జనవరి, ఫిబ్రవరి నెలల్లో చిరంజీవి హీరోగా చలం మరో చిత్రాన్ని ప్రారంభిస్తారు

'నా దేశం'లో ఎన్.టి. రామారావు, జయసుధ

## ఎన్ టి ఆర్. "నా దేశం" రికార్డ్ !

పల్లవీ దేవీ ఫిలివ్స్ అధినేతలు ఎస్ వెంకటరత్నం, దేవీ వరప్రసాద్‌లు – భారీ తారాగణం గల "నా దేశం" చిత్రాన్ని 19 రోజుల్లోనే పూర్తి చేయడమంటే మాటలు కాదు తల్లితండ్రులు లేని వారికి దేశమే తల్లి 'దేశాభ్యుదయమే లక్ష్యంగా కంకణం కట్టుకోవాలని చాటే మానవతా వాదిగా, బడుగు వర్గపు వ్యక్తి 'భరత్'గా ఎన్ టి ఆర్ ప్రతి రోజూ 20 గంటల చొప్పున 13 రోజులలో తమ షూటింగ్ పనిని పూర్తి చేశారు ఐతే, ఈయన మామూలుగా ఒక రోజులో పూర్తి చేసే డబ్బింగ్ వర్క్‌కు– ఈ చిత్రం రష్స్ చూశాక ప్రత్యేకమైన శ్రద్ధతో మూడు రోజుల టయిమ్ తీసుకున్నారు మొత్తం చిత్రం 19 రోజులలోనే పూర్తయింది ఊటీలో మూడు పాటలను ఛాయాగ్రాహకుడు ఎస్ వెంకటరత్నం నైపుణ్యంతో ఐదు రోజుల్లో చిత్రీకరించారు చిత్రంలోని ఆరు పాటలను వేటూరి రెండు రోజుల్లో రాస్తే, ఐదు రోజుల్లో సంగీత దర్శకుడు చక్రవర్తి రికార్డ్ చేసి, రికార్డ్ సృష్టించారు "తప్పెవరు చేసినా తీర్పు చెప్పాల్సింది ప్రజలే"– లాంటి 'తెలుగుదేశం' పార్టీ ఆశయాలు, లక్ష్యాలను ప్రతిబింబించే ఈ చిత్రం కలెక్షన్‌లలోనూ రికార్డ్ సృష్టిస్తుందని చిత్ర పరిశ్రమలోని పలువురి జోస్యం జయసుధ, జమున, కాంచన, రాజ్యలక్ష్మి, రోహిణి, సిల్క్‌స్మిత, కాకినాడ శ్యామల, జగ్గయ్య, ప్రభాకరరెడ్డి, సత్యనారాయణ, గిరిబాబు, అల్లు రామలింగయ్య ప్రభృత నటవర్గం పరుచూరి సోదరుల రచన, భాస్కరరాజు శిల్పం, కోటగిరి వెంకటేశ్వరరావు కూర్పుతో ఈ చిత్రానికి ప్రతిభావంతంగా దర్శకత్వం వహించిన కె బాపయ్య "విజయదశమి కానుకగా విడుదలవుతుంది," అని తెలియజేశారు

'ప్రేమ పిచ్చోళ్లు'లో జయమాలిని



## డైరెక్టర్ వేజెళ్ళ సత్యనారాయణ చిత్రాలు

యురేఖా సినీ ఎంటర్‌ప్రైసెస్ "ఇది కాదు ముగింపు" చిత్రం షూటింగ్ అక్టోబర్ 14న ముగుస్తుంది వేజెళ్ళ స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో పి సాంబశివరావు సమర్పించే కృష్ణసత్యా క్రియేషన్స్ "ఇదిగో ప్రశ్న ' ఏదీ జవాబు !" చిత్రానికి ఎ కృష్ణకుమార్ నిర్మాత పద్మావతీ ఫిలివ్స్ సమర్పించే "ఈ దేశంలో ఒక రోజు" చిత్రానికి ఉప్పలపాటి సూర్యనారాయణ బాబు నిర్మాత "ఈ చరిత్ర ఏ సిరాతో" చిత్రాన్ని హిందీలో పద్మాలయ సంస్థ నిర్మించవచ్చు



వెన్నెల మోమును
మంగళకరమైన
మెరుగు పరచునది
ఐటెక్స్
మాట్ ఫినిష్ తిలకం
దేశమంతటా నాగరిక యువతులు కోరి
ధరించేది ఐటెక్స్ తిలకం నారీమణుల పుష్ప
వదనాన్ని అద్భుత సౌందర్యాన్ని ప్రస్ఫుటం
చేసేటందుకే కన్నులకింపైన 14 రంగులలో
దొరుకుచున్నవి. శాస్త్రీయ విధానంలో
తయారుచేయబడు ఐటెక్స్ తిలకం
చర్మానికి ఎటువంటి హానియు కలుగజేయదు
DELUXE KUMKUM
EYETEX
SHAKE WELL
EYETEX
అరవింద్
Imageads-M-AL-14·24 Tel

# సినిమా

## సిద్ధమవుతూన్న దాసరి చిత్రాలు

★ వీరరాణి ఎంటర్ ప్రైసెస్ సమర్పించే కోటగిరి ఫిలిమ్స్ "ఊరంతా సంక్రాంతి" చిత్రం అక్టోబర్ చివరి వారంలో విడుదలవుతుంది. ఎ ఎన్ ఆర్, కృష్ణ, జయసుధ, శ్రీదేవి, సత్యనారాయణ, రావు గోపాలరావు, అల్లు రామలింగయ్య, గిరిబాబు, నాగేష్, వంకాయల, రమాప్రభ, రాజసులోచన, మమత, నిర్మల పాత్రధారులు

'పెళ్లి చూపులు'లో విజయశాంతి



★ కొసరాజు రాఘవయ్యచౌదరి సమర్పణలో ఙ భానుప్రసాద్ నిర్మించే "ఓ ఆడది – ఓ మగాడు" చిత్రం షూటింగ్ దాదాపు పూర్తయినట్లే. ఎం ఎస్ విశ్వనాథన్ సంగీతం, హరి ఛాయ, రవి సహదర్శకత్వం, కృష్ణమోహనరెడ్డి సహకార దర్శకత్వం, రవీంద్రబాబు కూర్పు నిర్వహించిన ఈ చిత్రంలో రవీంద్ర, అలేఖ్య, బాలాజీ వగైరా నూతన నటీనటులే పాల్గొన్నారు









నటసామ్రాట్ అక్కినేని 200వ చిత్రం 'మేఘ సందేశం' పూర్తి చేసిన సందర్భంలో దర్శక నిర్మాత దాసరి నారాయణరావు కన్నడ నటసామ్రాట్ రాజకుమార్ ద్వారా అక్కినేనికి మెమెంటోను అందజేస్తున్న దృశ్యం తారకప్రభు ఫిలింస్ ఆధ్వర్యంలో జరిగిన ద్విశత చిత్రోత్సవంలో కేరళ విశ్వవిద్యాలయానికి డా అక్కినేని పాతికవేల రూపాయలు విరాళం యిచ్చారు

''బతికుంటే బలుసాకు తినొచ్చు!
* ఫైటింగ్ సీనుల్లో నటించను –
అంటున్నాడుసార్ ఆ కొత్త హీరో!''

# సినిమా

## "మనిషికో చరిత్ర" లో చిట్టిబాబు సందేశం!

చిట్టిబాబు (చంద్రమోహన్) స్నానం చేసి రాగానే శారద (ప్రభ) ''ఏవండీ! ఈ రోజు సన్డే పాపని హాస్టల్ నుండి తీసుకురావాలి నా కింకా వంట కూడా కాలేదు ఈ జాకెట్‌కి బటన్ కొంచెం కుట్టిపెడతారా?'' అంది గోముగా

చిట్టిబాబు మెలికలు తిరిగిపోతూ, ''ప్లెషర్ విత్ గ్రేట్ ప్లెషర్!'' అన్నాడు

''థాంక్స్!'' శారద జాకెట్ ఇచ్చేసి వెళ్లిపోగానే పానకంలో పుడకలా దాపరించాడు రాజా (రాంజీ) చిట్టిబాబు కుట్టడం చూసి, ''ఏవండి! మీరు మీ ఆవిడ జాకెట్టుకి బటన్లు కూడా కుడతారా?'' అన్నాడు క్వశ్చన్ మార్క్ ముఖంతో

చిట్టిబాబు తాపీగానే ''ఏం? నా చొక్కాకి మా ఆవిడ బటన్లు కుట్టొచ్చుగానీ, మా ఆవిడ జాకెట్టుకి నేను బటన్లు కుట్టకూడదా? ఇదెక్కడి న్యాయం సార్?'' అన్నాడు

''అదికాదు సార్! ఆడవాళ్ళు చేసే పనులు వేరు, మగవాళ్ళు చేసే పనులు వేరని అనుకోవడం ఉంది కదా?'' వెకిలిగా నవ్వాడు రాజా

చిట్టిబాబు మాత్రం సీరియస్ ముఖం పెట్టి, ''ఇదిగో చూడు, బాబూ! భార్యా భర్తల మధ్య పర్ఫెక్ట్ అండర్‌స్టాండింగ్ ఉంటే – భార్య లోపల్లంగాకి బొందు కుట్టడం కూడా మన పనే మంచి పనే– నేర్చుకో సీనియర్‌ని చెప్తున్నా,'' అన్నాడు

రాజా నవ్వాపుకోలేక ముఖాన్ని పక్కకు తిప్పుకున్నాడు

తాతినేని ప్రసాద్ స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో చింతపల్లి ప్రసాద్, టి నారాయణరెడ్డి, నిర్మించిన భార్గవ ఆర్ట్ ప్రొడక్షన్స్ ''మనిషికో చరిత్ర'' చిత్రం త్వరలో విడుదలవుతుంది

## 'మన'సత్యం సమర్పించే దేశానికొక్కడు

''సత్యనారాయణ వర్క్ మాత్రం కొంత బేలన్స్ ఉంది అది పూర్తిచేసి, నవంబర్‌లో రిలీజ్ చేస్తాను,'' అన్నారు 'మన'సత్యం ఈయన సమర్పణలో సంజయ్, వంశీ నిర్మించే అజయ్ ఆర్ట్ క్రియేషన్స్ ''దేశానికొక్కడు'' చిత్రంలో రజనీకాంత్, మోహన్‌బాబు, గీత, జయమాలిని, ప్రధాన పాత్రధారులు గొల్లపూడి కథకుడు ఇళయరాజా సంగీత దర్శకుడు సి వి రాజేంద్రన్ దర్శకుడు కల్యాణ సంజయ్ ఇంటర్నేషనల్ పతాకంలో 'మన'సత్యం సమర్పించే ''మాలపిల్ల మనవరాలు'' షూటింగ్ త్వరలో ప్రారంభమవుతుంది

## "ఖబడ్దార్ కన్నయ్య"గా కృష్ణ

''షంషేర్ శంకర్'' అనంతరం కె ఎస్ ఆర్ దాస్ దర్శకత్వంలో నిర్మాత పి పద్మనాభన్ జనవరి 1న ప్రారంభించే మక్కళ్ తిలకం మూవీస్ ''ఖబడ్దార్ కన్నయ్య''లో కృష్ణ హీరో



శరణాలయం దత్తుడు నిర్వహిస్తున్నాడు. అతనా వంశంలో ఆరో దత్తుడు అతనికీ పిల్లలు లేరు మరొకర్ని దత్తత చేసుకోవటం కంటే ఆస్తిని శరణాలయంకి రాయటం మంచిదనుకుని తన యావ దాస్తిని శరణాలయంకి రాసిచ్చేడు

ఆలయ నిర్మాణం, మిగిలిన భవంతుల నిర్మాణం బుచ్చిరాజు స్వయంగా చూస్తున్నాడు శ్రీరామ్. కొన్ని చిన్న పనులు కాంట్రాక్టు తీసుకుంటూ ఆలయ నిర్మాణంలో తన ఇంజనీరింగ్ పనితనాన్ని జోడిస్తున్నాడు

ఇలా ఊర్లో వచ్చిన మార్పుల్లో దీక్షితులుగారి కుటుంబము పాలు పంచుకోవటం వల్ల నెలసరి వేతనాలపై వారి సంసారం సమృద్ధిగానే సాగుతోంది

మోటార్ సైకిల్ దిగేడు శ్రీరామ్ కాకిరంగు టెరీకాట్ పాంటుమీద తెల్ల షర్టు ఇన్‌షర్టు చేశాడు

మోటార్‌సైకిల్ దిగి —

"ఏం శర్మ బావగారు ఇక్కడే నిలబడిపోయేరు ఏం మీనాక్షి సుబ్బరాజు లేడా ?" అడిగేడు బావని, చెల్లిని

వేలాది జనం ఉన్నా సవ్వడిలేదు నిశబ్దంగా ఉంది ఆశ్రమ గుమ్మంలో నిలబడి గౌతమానందులను దర్శించుకుని వెళ్ళాల్సిందేకాని ఎవరూ లోపల ప్రవేశించకూడదు

అక్కడ లోపలకు ప్రవేశించేది, సౌజ్ఞా పూర్వకంగా వారితో భాషించేది సుబ్బరాజు మాత్రమే ఎవరైనా తమ కోరికలు, విన్నపాలు విన్నించుకోదలిస్తే వారి విన్నపాల్ని వారు మనసులో స్మరించుకుంటే గౌతమానందుల కవగతం అవుతుందని, వారి కార్యక్రమాలు నిర్విఘ్నంగా జరుగుతాయని నమ్మిక

ఆశ్రమగుమ్మమ్ముందు నిలబడి ఉన్న సుబ్బరాజు వీళ్ళను చూశాడు దగ్గరకొచ్చి —

"రండి బావగారూ మీ బావగారిని చూద్దురుగాని వారి ఆశీర్వచనం తీసుకుందురుగాని" అన్నాడు

అందర్ని ప్రత్యేకంగా తీసుకెళ్ళి గుమ్మం ముందు నిలబెట్టేడు

అంతా చేతులు జోడించేరు

ఉదరం మీదకు వాలుతున్న గడ్డం జడలు కట్టిన కేశాలు మహా తేజస్సును వెడలుగక్కుతున్న నేత్రాలు. . గౌతమానందులు క్షణకాలం వీళ్లని పరిశీలించి, ప్రార్థన పూర్వకంగా కను రెప్పలు మూసేరు తర్వాత మళ్ళీ అదే నిర్వికారమైనచూపు

"జనం బాగా ఉన్నార్రా" అన్నాడు పరమేశ్వరుడు

సాయంత్రమే దొరికే గౌతమానందుల దర్శనానికి బారులుతీర్చి నిలబడి ఉన్నారు జనం

దర్శనం పూర్తి చేసుకుని వస్తుంటే...

"గౌతమానందుల కన్న మీ జననీ జనకులు రక్తం పంచుకున్న మీరూ చరితార్థులు" అన్నాడు శర్మ.

"నేను వెళ్లాలి బావగారు ఆలయ నిర్మాణం పూర్తి కావస్తోంది, ప్రతిష్ఠ దగ్గర పడింది కొంచెం పనులున్నాయి" అన్నాడు శ్రీరావ్

"నువ్వు వెళ్ళిరా మేము కాస్సేపు మండపంలో కూర్చుని వెళతాం" అన్నాడు పరమేశ్వరుడు

శ్రీరావ్ వాళ్ళ దగ్గర సెలవు తీసుకుని ఆలయం దగ్గర కొచ్చేడు

తూర్పు ముఖంగా గాలి గోపురం సర్వేశ్వరుని ఆలయం నైరుతిలో గణపతికి, ఆగ్నేయంలో సూర్య దేవుడు, ఈశాన్యంలో విష్ణువు, వాయవ్య దిశలో అంబిక పంచాయతనము నిలువెత్తు నందీశ్వరుడు. దాదాపు పని కావస్తోంది

ఆగమ శాస్త్రానుసారంగా ఆలయ నిర్మాణం జరుగుతోంది

పనివాళ్ళు గాలిగోపురానికి ప్లాస్టరింగ్ చేస్తున్నారు

ధ్వజస్తంభానికి రాగి రేకులు బిగిస్తున్నారు మరికొందరు బుచ్చిరాజు అక్కడ నిలబడి ఉన్నాడు

"ఆశ్రమంనించా" అడిగేడు

శ్రీరావ్ తలూపేడు

ఇక పెళ్లి హడావిడి అయింది గన్క ఇక ప్రతిష్ఠ వ్యవహారాలు చూడండి ఎల్లుండి సమావేశం అందరికి వర్తమానం అందింది కదా ఇందాకా హార్డ్‌వేర్ షాపువాడు మీకు ఫోను చేశాడుట వెళ్ళి కనుక్కోండి ఆఫీసులో గుమాస్తా అన్నాడు అతన్నే కనుక్కోండి" అన్నాడు బుచ్చిరాజు

శ్రీరావ్ తలూపి ఆలయానికి దగ్గరలో ఉన్న ఆఫీసులోకి నడిచేడు అప్పటికే మళ్ళీ ఫోను మ్రోగుతోంది

## 2

నందిసావిడి దగ్గర కోలాహలంగా ఉంది ఆలయ ప్రతిష్ఠాపన విషయం చర్చించడానికి ప్రముఖులంతా అక్కడకు చేరేరు

నాలుగురోజుల్లో జరుగబోయే ప్రతిష్ఠ కార్యక్రమానికి కావాల్సిన పన్నును జరిగిన పన్నును సింహావలోకనం జరిగిన వెనుక శేషాద్రి లేచి నిలబడ్డాడు

"కమిటీ సభ్యులకు, పురప్రముఖులకు,

# ధర్మో రక్షతి రక్షితః

ఆలయ నిర్మాణానికి, ఆశ్రమానికి భూరి విరాళాలిచ్చిన వదాన్యులకు నమస్కారములు

మహాశయుల్లారా మన ఊరు ఎంతో పుణ్యం చేసుకుంది సాక్షాత్తు వేదబ్రహ్మ అయినటువంటి శ్రీ యజ్ఞన్న దీక్షితులుగారి కుమారులైన గౌతమానందులు ద్వారా మన గ్రామం కైలాసమయింది శివుడే మనముందు వచ్చి నిలిచేడు మన జన్మ చరితార్థమైంది

సర్వేశ్వరుడు ఎందరో వదాన్యుల హృదయాల్లో ప్రవేశించేడు భూరి విరాళాలు ఇచ్చేరు మాటకు మన శ్రీపతిగారు పదెకరాల భూమిని స్వామికి నిత్య ధూపదీప నైవేద్యాల నిమిత్తం సమర్పించేరు

ఎందరో ఎన్నోవిధాల సహకరించేరు ఆలయ నిర్మాణం పూర్తికావస్తోంది పైగా మన సీతారాముడిగారి ప్రయత్నాల వల్ల మన సంస్కృత పాఠశాలకు, వేదపాఠశాలకు ప్రభుత్వ సహాయం కూడా లభించబోతోందని ఇప్పుడే తెలిసింది

మరో విషయం, గౌతమానందుల ఆకర్షణ ప్రభావంతో ఆంధ్రదేశ నలు మూలల్నుంచి భక్తులు మన గ్రామానికి విచ్చేసి విరాళాలు సమర్పిస్తున్నారు

అంతేందుకు పరమనాస్తికులుగురవయ్యగారు క్షమించాలి నిన్నగాక మొన్నవరకు వారు నాస్తికులు గురవయ్యగారు చావు బ్రతుకుల్లో ఉన్న భార్య మాట కాదనలేక దంపతులు వారి దర్శనానికి వెళ్ళేరు ఎందరో వైద్యులు ఆశ వదిలిన ఆమె అనారోగ్యం వారికడ కంటి చూపుతో నయమైంది వారి విభూదితో ఆమె ఆరోగ్యవంతురాలైంది ఆయన యాభై వేలు ఆశ్రమానికి సమర్పించేరు

ఆ ధనంతో గౌతమానందుల నిర్ణయం మేరకు ప్రకృతి చికిత్సాలయాన్ని నెలకొల్పడానికి సన్నాహాలు జరుగుతున్నాయి

ఎందరో ఎన్నో విధాల సాయపడుతున్నారు సాయపడుతున్నారు అనటం కంటే వారి వంతు భాగం వారిచేత నిర్వహింప చేయిస్తున్నాడా సర్వేశ్వరుడు

ఇకపోతే ఈ నెల పదిహేనవ తారీకు నించి ఇరవై తారీకు వరకు ఆలయ ప్రతిష్ఠాపన మహోత్సవం జరుగుతుందని మీ కందరికి తెల్సు

అపూర్వమైన ఈ ముహూర్త నిర్ణయం అపర బృహస్పతి దువ్వూరి వెంకట్రామశాస్త్రిగారు నిర్ణయించేరు ఈ ముహూర్త బలంవల్ల అపూర్వ సంఘటన ఏదో జరుగుతుందని వారు సెలవిచ్చేరు

మహా సిద్ధాంత శిరోమణి మాట వీరుపోదుగా!

ఇకపోతే ఈ కార్యక్రమానికి మన గౌతమానందుల ఆది గురువులు కృష్ణానందులవారు విచ్చేస్తున్నారు ఆలయ ప్రతిష్ఠ కార్యక్రమం వారి నేతృత్వంలో జరుగుతుంది

శివలింగాన్ని ధాన్యాది వాసము, జలాది వాసము, క్షీరాది వాసము చేయించి, కళా ఆహ్వానం వారు దగ్గరుండి జరిపిస్తారు

ఇలాంటి మహత్తర కార్యక్రమంలో అయిదు రోజులు భజనలు, హరికథలు, సంగీత కార్యక్రమాలు ఏర్పాటు చేయబడ్డాయి ఆఖరి రోజున కూచిపూడివారి గిరిజా కళ్యాణం కూడా ఏర్పాటు చేయటం జరిగింది

గనుక మీరు యావన్మందీ విచ్చేసి కలియుగ కైలాసంలో కార్యక్రమాలు వీక్షించి చరితార్థులు కమ్మని నా ప్రార్థన"

నిటూర్చి, చెమటలు తుడుచుకుంటూ కూర్చున్నాడు శేషాద్రి

తర్వాత బుచ్చిరాజు లేచి మాట్లాడటం మొదలెట్టాడు

అర్థరాత్రి వరకు మహోత్సవంతో సభ జరుగుతూనే ఉంది

## 3

రాత్రి పదకొండు గంటలు అవుతోంది ఆగమ శాస్త్ర పండితులతో మాట్లాడి ఆలయం నించి ఇంటికి బయల్దేరేడు పరమేశ్వరశాస్త్రి ప్రతిష్ఠాపన కార్యక్రమానికి ఇక రెండు రోజులే వ్యవధి ఉండటం వల్ల పనివారు రాత్రి కూడా పనిచేస్తున్నారు

ఆలయానికి వెనుక రోడ్డులో ఉన్న ఆశ్రమం ముందునించి నడుస్తున్నాడు పరమేశ్వరుడు అతనేదో ఆలోచనల్లో వున్నాడు శివలింగానికి ప్రతిష్ఠ చేసే ముందు జరిగే కళా, ఆహ్వానంలో విషయంలో ఆగమ






పండితులకు పరమేశ్వరునికి మడతపేచీ వచ్చింది. అగ్నిదేవునికి పది కళలని పరమేశ్వరుడు వాదిస్తే అగ్నిదేవునికి పన్నెండు కళలని పండితులువాగించేరు. చివరకు దువ్వూరి వెంకట్రామశాస్త్రిగారొచ్చి తేల్చేరు పరమేశ్వరుని వాదమే సబువని. దాంతో.. ఆలస్యమైంది.

ఆ విషయమే ఆలోచిస్తూ నడుస్తున్న పరమేశ్వరునికి తనముందు ఏదో ప్రాకినట్లనిపించింది. ఆగిపోయేడు. జరజరా ప్రాకుతోంది నాగుపాము. నాలుగడుగుల పొడుగున్న నాగుపాము పడగ ఎత్తి బుసకొడుతూ వంకరలు తిరుగుతూ వెళుతోంది. పడగెత్తి ఆగి ఆగి వెళుతోంది.

ఊపిరి బిగబెట్టి నిలబడి పోయేడు పరమేశ్వరుడు. అతనికేం చేయాలో తోచలేదు. నలుగుర్ని పిలిచి పామును కొట్టిస్తే... పాముని చంపకూడదంటారు. పైగా... పాము శంకరుని ఆభరణం...కాని... ఇక ప్రతిష్ఠ నాల్గు రోజులు. ఇక్కడ రాత్రి పగలు... పసిపిల్లలు, ఆడవారు కూడా తిరుగుతారే.. ఎలా? ఏం చేయాలో అతనికి తోచలేదు.

పాము చరచరా వెళ్ళిపోతోంది. నెమ్మదిగా దానికి దూరంగా అడుగులు వేసుకుంటూ నడుస్తున్నాడు.

"ఎక్కడనించి వచ్చిందీ పాము ? దీన్ని ఇలా

# ధర్మో రక్షతి రక్షితః

పోనిస్తే ఎవరినైనా కాటు వేయవచ్చు. పోనీ ... పట్టిస్తే ... ఇంత స్థలంలో అది ఎక్కడికి వెళ్ళిందో ఎలా తెలుస్తుందీ ? మట్టి, కంకర, సిమ్మెంట్ ఎక్కడ చూసినా గుట్టలుగా ఉంది. ఎటైనా పోవచ్చు. ఎలా ? వెనక్కి తిరిగి తనను కాటు వేయదుకదా ?" ఆ ఆలోచన రావటంతో కాళ్ళు వణికేయి. నడక ఆగింది. పాము చరచరా ప్రాకుతూ ఆశ్రమం కర్రగేటు క్రిందనించి వెళ్ళింది. గేటు మూసేవుంది.

పరమేశ్వరశాస్త్రికి ఒళ్ళు ఝల్లుమంది.

'ఇది వెళ్ళి ... తపస్సు చేసుకుంటున్న గౌతమానందుల్ని కాటువేయదుకదా ? అంతటి తపోధనుణ్ణి కాటు వేయగలదా ? ఏమో ... నిమిలిత నేత్రుడైన అతన్ని కాటువేస్తే ? హెచ్చరిస్తే . . హెచ్చరించడానికి అతను కదలడు. పలకడు కదా ! పోని సుబ్బరాజు అప్పుడప్పుడు వరండాలో నిద్రిస్తు ఉంటాడు. వెళ్ళి అతన్ని హెచ్చరిస్తే ? లేకుంటే ఈ పాము గౌతమానందుల్ని కాకున్నా అతన్ని కాటు వేయచ్చు.'

కొన్ని క్షణాల్లో పరమేశ్వరుడొక నిర్ణయాని కొచ్చి, మెల్లిగా కర్రగేటు శబ్దం కాకుండా తెరిచి

## ప్రజాదరణ

నేను
నాయకుడ్ని కాదు
కవిని.
అందుకే —
నాకు
సన్మానం జరిగేది
దండలతో కాదు
గుండెలతో...

— భగ్వాన్

ఆశ్రమంలో అడుగుపెట్టాడు అతనికి ఒంటినిండా చెమటలు పోస్తోంది. అతనికీ ఎడమ కన్ను అదిరినట్లు అనిపించింది. తను పామును అనుసరించటం విజ్ఞత కాదేమో ... తనకేం కాదు కదా ? ఏమిటీ అపసూచికం?

పాము వెళ్తానే ఉంది. కొద్ది గజాల్లో పరమేశ్వరుడు అనుసరిస్తున్నాడు. పాము కదలికలకు చెట్లక్రింద ఉన్న ఎండుటాకులు గలగలలాడుతున్నాయి. దృష్టి దానిమీదనే లగ్నం చేస్తూ సవ్వడి లేకుండా నడుస్తున్నాడు పరమేశ్వరుడు. ఆశ్రమం తలుపులు మూసి ఉన్నాయి. లోపల ప్రమిద వెలుగుతున్నట్లుగా ఉంది. వెలుగు కొద్దిగా కిటికీలోంచి బయటకు పడుతోంది

ఆశ్రమ వాకిటి వరకు నడిచేడు పరమేశ్వరుడు. పాము వాకిటి ఎడమవైపునున్న ద్రాక్ష పందిరికేసి వెళ్ళటం చూశాడు పరమేశ్వరుడు. క్షణకాలం అతని దృష్టి కిటికీగుండా పడుతున్న వెలుతురుకేసి మళ్ళించేడు. పాము ఏమైందో అతనికి కనబడలేదు.

'పాము ద్రాక్ష పందిరి క్రిందనే ఉందా ? ఏమిటి చేయటం?' ఆలోచిస్తున్నాడు పరమేశ్వరుడు. అతనికి ఒళ్ళంతా చెమటలు పట్టింది. అతని గుండె సవ్వడి అతనికే వినిపిస్తోంది.

"ఈ ఫలం కూడా తీసుకో గౌతమా ..." ఎక్కడనించో వినిపించింది.

ఉలిక్కిపడ్డాడు పరమేశ్వరుడు.

"ఎవరిదా స్వరం ? ... ఎక్కడనుండీ .. ?"

"ఫర్వాలేదు తీసుకో గౌతమా ?"

'ఎక్కడనించీ ... లోపలనించా ... ?'

"నిన్న కూడా...నువ్వు ఫలహారం చేయలేదు "

'అది సుబ్బరాజు కంఠంలా ఉందే ... అతనీ రాత్రివేళ ఎవరికి ఫలహారం ఇస్తున్నట్లు ?'

"వద్దులేవయ్యా ! అసలీ నాల్గురోజులు ఇటు జన సంచారం హెచ్చుగా ఉంటుంది. నిన్ను రావద్దని చెప్పేను. నిన్ను ఫలహారం తేవద్దని చెప్పేను. నువ్వు వింటేగా ... ?" గౌతముని కంఠం.

పరమేశ్వరుడికి భూమి గిర్రున తిరుగుతున్నట్లు అనిపించింది. తలమీద బండరాయి పడినట్లు... తలను తడుముకుంటూ నిశ్చేష్టుడయి నిలబడిపోయేడు.




### విజేంద్ర — ఆదోని

ఒక ఆడది రోడ్డున పోతూంటే ప్రతి మగవాడూ చూస్తాడు కాని ఒక మగవాడు పోతూంటే ఒక్క ఆడది కూడా చూడదు ఎందుకని?

★ ఆడదానికి వేటాడే లక్షణం తక్కువ

### వీర్ - సామర్లకోట

కులం మతం వర్గం పేరిట ఈ ముసుగులో ప్రేమ హృదయాలను విడదీసే పెద్దలు ఉత్త బదుద్దాయిలు

★ అలా విడదీయ బడడానికి సిద్ధంగా వుంటే ప్రేమికులు బదుద్దాయిలు కారా ?

మనసిచ్చి, మనసు దూరమై పోయినప్పుడు పొంగి పొరలి వచ్చిన కన్నీటి వరదల్లోంచి పుట్టింది నా నాస్తికత్వ వాదన మీరు ఆస్తికులైతే మనకి చుక్కెదురే

★ అదే మంచిది ఏడుపుగొట్టు వేదాంతం నాకు నచ్చదు !

### పి. యు. ఎమ్. - కాశీబుగ్గ

ప్రేమించిన అమ్మాయినే పెళ్లి చేసుకోవాలని ఏ చరిత్రలోనైనా రాసి వుందా? ఆ చరిత్ర పేరు చెప్పండి—

★ ఎక్కడా రాసి లేదు అంచేత చరిత్ర మీరే— సృష్టించాలి !

### జి వి. — హైదరాబాదు

ఒక అమ్మాయికి పదిసార్లు పెళ్లిచూపు లయ్యాయి నలభై వేలు కట్నం యిస్తామన్నా పెళ్లి చేసుకోడంలేదు నా కామెతో పరిచయం ఉంది కట్నం లేకుండా పెళ్లి చేసుకుంటానన్నాను కులం తక్కువవాడినని తిరస్కరించింది

★ కులం తక్కువ అని అయివుండదు ఏదో పెద్ద సంఘసేవ చేస్తున్నట్టు చేసుకుందుకు సిద్ధపడితే అసహ్యం వేసి తిరస్కరించి వుంటుంది అంతే

### కె. ఆర్ కె ఆర్ — పలాస

నేను ఒక అమ్మాయిని ప్రేమించాను పెళ్లి చేసుకుందుకు మా అమ్మా నాన్న ఒప్పుకోవడంలేదు ప్రాణంలో సగమైన ప్రియురాలిని మరువనా? ప్రాణానికి ప్రాణమైన తల్లితండ్రులని విడవడమా ?

★ చూడు తమ్ముడూ, ఎందుకొచ్చిన గొడవ గాని — ప్రాణానికి ప్రాణమైన తల్లితండ్రుల మాటే విను తీరా ప్రియురాలి మాట వింటే సగం చచ్చి బ్రతకడమవుతుందేమో !

### జి వి ఎమ్ - సికింద్రాబాదు

చదువుకున్నది మరిచిపోవడం ఎందుకు జరుగు తుంది ?

★ ఏకాగ్రత లేకుండా చదవడంవల్ల నిజానికి చదివినది మరిచిపోవడం — చదవడంకంటే కష్టం నిజంగా నేర్చినది మరిచిపోవడం జరగదు

ఎందుకు కొందరంతా గొప్పలు చెప్పుకుంటారు?

★ పెద్ద పాత్రలో చిల్లికానీ వేసినా చప్పుడు అధికంగా వస్తుందని గ్రహించక

### ఎ. ఆర్ - సికింద్రాబాదు

మీ జవాబులు నాకు టానిక్‌లాగా పనిచేస్తాయి ఆకుపంచర్ సూదుల్లాగా రిలీఫ్ యిస్తాయి ?

★ అక్కడితో ఆపండి బాబూ, మీకు కుదిరిన వైద్యం అందరికీ కుదురుతుందని అనుకోకండి

### ఎమ్. వి. — భద్రావతి

ఇద్దరిని కట్టుకు వేగలేక చస్తుంటే ఇంకో కన్య నన్ను మనసారా ప్రేమించి వలలో వేసు కుందామని చూస్తోంది

★ అబ్బ పెద్ద 'మన్మథ కుంజునని' నమ్మ కమా మీకు? ఎందుకయ్యా ఇలాంటి కట్టు కథ లల్లుకుని కలలు కంటారు చవుక బారుగా లేదూ?!

### ఎస్ ఎస్ ఎన్. — ఆదోని

ఒక అందమైన అమ్మాయి పేరు రహస్యంగా కనుక్కొని ఆమెకు చెప్పకుండా ఆ పేరుతో లేఖలు, ప్రశ్నలు, జోకులు వ్రాశాను అచ్చయ్యాయి ?

★ ఇంకేం ? ఆ పేరుతో ఏపాటికో నవల రాసి ఏ పోటీకో పంపించేవుంటారు ! (అయినా ఇలాంటి దొంగచాటు పనిలో కొందరు రచయిత మగాళ్లకి థ్రిల్ వుంటుంది కాబోలుగాని — నాకు పరమరోత అనిపిస్తుంది )

### జి కె ఎన్ ; కల్లుబాయి — ఆదోని

మనసున్న మనుషులకి సుఖముండదు ఎందుచేత?

★ మంచి చెడుల బేరీజు వేస్తూనే వుంటారు అందుచేత

మగవాళ్ల కన్నీటి కంటే ఆడదాని కన్నీటికి విలువ ఎక్కువ ఎందుచేత ?

★ విలువ కాదు గుర్తింపు ఆడది ఏడిస్తే అమాయకంగానూ, మగాడు ఏడిస్తే ఆడంగిగాను అనిపిస్తుంది

### జి ఎస్ ఆర్. — నేలకొండపల్లి

గుణవంతురాలైన భార్యకి విలువ ఇవ్వకుండా పరాయి ఆడదానికి విలువ యిస్తారేం భర్తలు ?

★ స్వంతమైపోయాక—విలువగా కన్పించదు

### ఎన్ ఎస్. ఆర్. - వీరవాసం

మీ ఆరాధ్య దైవం ?

★ ఎవరూ ప్రత్యేకంగా లేరు !

---

"నిన్న కూడా ఫలహారం లేదు ఉండబట్టలేక వచ్చేశాను" సుబ్బరాజు

"ఇక ఈ శరీరాన్ని ఈ ఫలాల్తో పోషించాల్సిన పని లేదు రాజూ క్రమంగా ఆహారాన్ని విసర్జిస్తాను "

పరమేశ్వరుని కళ్ళముందు మెరుపు మెరిసినట్లయింది చీకటిలో శిలా ప్రతిమలా నిలబడిన పరమేశ్వరుడు మెల్లగా వెలుగులోకి వచ్చేడు కిటికీ గుండా లోపలికి చూశాడు

అతనికా క్షణంలో తను చూసిన పాము గుర్తుకు రాలేదు అవమానాగ్నితో అతని శరీరం దహించుకుపోతోంది పళ్ళు పట పట కొరికి లోపలికి చూశాడు

గౌతముడు కాళ్లు ఆరచాపుకుని గోడకుచేర్లబడి కూర్చున్నాడు అతని ముందు పళ్లెంలో వివిధ ఫలాలు ఉన్నాయి సుబ్బరాజు హనుమంతుడిలా మరం వేసుకుని కూర్చున్నాడు

"రేపే కృష్ణానందులవారు వేంచేస్తున్నారు ఎల్లుండి నించి కార్యక్రమం ఆరంభ మవుతుంది నాకు మాత్రం కృష్ణానందులు వస్తూన్నారంటే భయంగానే వుంది గౌతమా ఎంతైనా వారు అవధూతలు వారు మన శివలింగ రహస్యం పసిగట్టి "

"ఊరుకో రాజూ నువ్వు నిశ్చింతంగా ఉండు నువ్వు చెయ్యాల్సిందల్లా నాకు ఆహారం తీసుకుని రాకుండా ఉండటమే ఇప్పుడిప్పుడే అలవాటు పడు తున్నాను నన్ను వెనుకకు మరల్చకు పైగా ఎవరి కంటనైనా నువ్వు పడితే ప్రమాదం" గౌతముడు నచ్చచెప్పే ధోరణితో అన్నాడు

పరమేశ్వరుడు కోపంతో ఊగిపోయేడు

"మోసం దైవ ద్రోహం" అప్రయత్నంగా అతని నోటివెంట వెలువడ్డాయా మాటలు

లోపల ఉన్న ఇద్దరు ఉలిక్కిపడ్డారు కిటికీకేసి ఒకేసారి చూశారు పరమేశ్వరుని చూసి చేష్టలుడిగి బొమ్మల్లా ఉండిపోయేరు

కొన్ని నిమిషాలు ఒకరికేసి ఒకరు చూసుకున్న తర్వాత సుబ్బరాజు

"పరమేశ్వరశాస్త్రిగారా! లోపలికి రండి" అన్నాడు

"లోపలికి రాను పగబట్టిన నాగుపాము ఇటే తిరుగుతోందని చెప్పటానికొచ్చేను శంకరుని ఆభరణ మయిన నాగుపాము శివ ద్రోహాన్ని సహించదు" అంటూ గిరుక్కున వెనక్కి తిరిగేడు పరమేశ్వరుడు

సుబ్బరాజు ఒక్క ఉదుటున లేచి తలుపు తెరుచుకుని బయట కొచ్చేడు

"పరమేశ్వరశాస్త్రీ పరమేశ్వరా "పిలిచేడు

వడివడిగా అంగలు వేసుకుంటూ పరమేశ్వరుడు ఆశ్రమానికి దూరంగా వెళ్లి పోతూనే ఉన్నాడు

**(ఇంకా వుంది)**




"ఉత్తిష్ట నరశార్దూలా
కర్తవ్యం దైవ మాహ్నికం "

సుప్రభాతం చెవిన పడేసరికి కిరణ్ బద్ధకంగా కళ్ళు తెరిచాడు శ్రావ్యంగా వినవస్తున్న సుప్రభాతం కిరణ్ ని ఇక పడుకోనివ్వలేదు

బాత్‌రూమ్ వైపు వెడుతూ వాసంతి కోసం చూశాడు స్టోర్ రూముగా అవతరించి, పూజా మందిరంగా మారిన చిన్నగదిలో వాసంతి పూజ చేసుకుంటోంది

కిరణ్‌కి చిరాకు వేసినా, ఏకాగ్రతగా పూజ చేసుకుంటున్న వాసంతిని చూస్తే ముచ్చటగా కూడా అనిపించింది

కమలమ్మగారు వంట ప్రయత్నంలో ఉంది కిరణ్ ముఖం కడుక్కుని, స్నానంచేసి వచ్చాడు వాసంతి ప్రశాంతమైన వదనంతో చిరునవ్వు లొలికిస్తూ కాఫీ తెచ్చింది

కడిగిన ముత్యంలా ఉన్న వాసంతిని చూసి కళ్ళెగరేస్తూ సన్నగా ఈల వేశాడు

అతని ఉద్దేశం గ్రహించిన దానిలా చప్పున రెండడుగులు వెనక్కివేసి "దూరం దూరం ! అత్తయ్యగారు పిలుస్తున్నారు" అంటూ తుర్రుమంది

ఇదిరోజూ జరిగే తతంగమే! అయినా సరే కిరణ్‌కి ఎప్పటికప్పుడు కొత్తగా, హాయిగా ఉంటుంది

కిరణ్ కాఫీ త్రాగి కప్పు టేబిల్‌మీద పెడుతూంటే, తనూ వాసంతీ తీయించుకున్న ఫోటో కని'ంచింది అప్పటికీ, ఇప్పటికీ కూడా వాసంతిలో ఏ మార్పులేదు పెళ్ళయిన తర్వాత స్త్రీకి పెద్దరికం వస్తుందంటారు వాసంతిని చూస్తే ఎవ్వరూ ఆ మాట నమ్మరు

అయిదు సంవత్సరాల క్రితం కిరణ్ బావగారు తిరుపతి నుండి వస్తూ యాక్సిడెంట్‌లో పోయారు రెండు నెలలు తిరగనేలేదు శ్రీశైలం క్యాంపునుండి తిరిగివస్తూ జీప్ యాక్సిడెంటయి తండ్రి కూడా పోయారు

కిరణ్‌కి అప్పుడే కొత్తగా ఉద్యోగం వచ్చింది తండ్రి పోవడంతో కుటుంబ బాధ్యత మీద పడింది దానికి తోడు భర్తపోయిన దుఃఖంలో అక్క, పెళ్ళికాని చెల్లెలు వనజ ఎదురుగా కనిపిస్తుంటే కిరణ్ గుండె బేజారై పోయింది

భర్త ఉద్యోగం వసుధకు రావడంతో కొడుకుని తీసుకుని విజయవాడ వెళ్ళిపోయింది తల్లి ఏడ్చి మొత్తుకున్నా వినలేదు కొడుకుని ఉంచడానికికూడా ఒప్పుకోలేదు

చెల్లెలు వనజకి తనే సంబంధం చూసి పెళ్ళి

చేశాడు ఆ అప్పులు, సంసారం చూసి కిరణ్ గుండెల్లో రాయి పడ్డట్టయింది

"నువ్వా పెళ్ళి చేసుకోరా కిరణ్" అంటూ తల్లిపోరటం మొదలు పెట్టింది తండ్రి చాటున ఏ చీకూ చింతా లేకుండా పెరిగిన కిరణ్ కి ఈ అప్పులు సంసార లంపటం చూసి హడలు పుట్టుకొచ్చి "పెళ్ళొద్దు మొర్రో! కొన్నాళ్ళు ఫ్రీగా బ్రతకనీ" అంటూ త్రోసేశాడు

రెండేళ్ళు గిర్రున తిరిగి పోయాయి ఈలోపు కిరణ్ అప్పులు చాలా తీర్చేశాడు ఈ మధ్యలో వనజ పురుళ్ళూ, పుణ్యాలూ అంటూ వచ్చినా పెద్ద ఇబ్బందేమీ అనిపించలేదు

కమలమ్మగారు కొడుకు చెవిలో అరిచీ, అరిచీ ఇక చివరికి కూతుళ్ళకే వదిలేసింది అతని పెళ్ళి విషయం వసుధ బాగా పట్టు బట్టింది ఆ సమయంలోనే వనజ మా అత్తగారికి తెలిసినవాళ్ళు అంటూ సంబంధం పట్టుకొచ్చింది

"నేను చేసుకోను అందులో పల్లెటూరంటున్నావు అసలే వద్దు పూజలూ, వ్రతాలూ అంటూ నా ప్రాణం తీస్తారు అందులో చాదస్తపు బామ్మగారి చేతుల్లో పెరిగిందన్నావు" అన్నాడు చిరాకు పడుతూ

"పిల్ల బి ఏ కూడా చదివిందిరా" అంది కమలమ్మగారు నచ్చచెప్తూ

"ఈ సిటీలో నే నొక్కడినే చావలేనమ్మా ఉద్యోగం చేసే అమ్మాయి కావాలి" అంటూ త్రోసి పుచ్చాడు

"ప్చ్! బంగారం లాంటి పిల్ల సాంప్రదాయ కుటుంబం" అంటూ సణుక్కుంటూ తల్లి ఫోటోని టేబుల్ మీద పడేసి వెళ్ళిపోయింది

కిరణ్ కాఫీ కప్పు టేబుల్ మీద పెడుతూ యదాలాపంగా ఫోటో చూశాడు మరుక్షణం అతని చేతుల్లో వుందా ఫోటో సిటీలో రకరకాల అమ్మాయిల్ని చూసి ముఖం మొత్తిన కిరణ్ అమాయకంగా, చక్కటి కను ముక్కు తీరులో, విశాలమైన కళ్ళతో ఉన్న ఆ అమ్మాయిని చూసి సంబరపడి పోయాడు

ముఖ్యంగా ఆ కళ్లల్లోఉన్న ముగ్ధత్వం కిరణ్ ని పట్టి నిలబెట్టటంతో ఆ రాత్రంతా అతను ఆ ఫొటోని చూస్తూనే బ్రతికాడు

'ససేమిరా' వీల్లేదు అంటూ తారాజువ్వలా లేచిన కొడుకు పెళ్ళి చూపులకు బైలు దేరటంతో కమలమ్మగారు సంతోషపడి పోయింది

కాకినాడ వెళ్లి వనజని తీసుకుని వెళ్లారు కాకినాడ దగ్గరున్న చిన్న పల్లెటూరది

బామ్మగారు పక్కా పల్లెటూరు పద్ధతిలో పెళ్ళికూతుర్ని తీసుకొచ్చి చాపమీద కూర్చోబెట్టింది

దేవుడంటే నమ్మకంలేని కిరణ్, ఆ ఇంటి వాతావరణాన్ని, బామ్మగారి ఆచారాలనీ, బుద్ధిగా, పొందిగ్గా చాప మీద కూర్చున్న ఆ బి ఏ చదివిన పెళ్ళికూతుర్ని చూసి అసంతృప్తి పడ్డాడు

ఫోటోలో అద్భుతంగా కనిపించిన ఆ అమ్మాయి బాగా తెల్లగా ఉంటుందనుకున్న కిరణ్, చామన ఛాయగా ఉండటంతో నిరుత్సాహ ఎడిపోయాడు

ఆ అమ్మాయి దొంగచూపులు చూడబోయి కిరణ్ కి పట్టుబడిపోయింది ఆకళ్ళల్లోని ముగ్ధత్వం, అమాయకత్వం నిండిన ముఖం, సౌమ్యత, కిరణ్ మనసుని పట్టి గాలం వేయటంతో "మీ పేరు" అన్నాడు

"వాసంతి" నెమ్మదిగా అంది

అంత చదువుకున్న అమ్మాయి అయినా కుదురుగ్గా ఉండటంతో కమలమ్మగారి ముఖం వికసించింది తల్లీ కూతుళ్ళిద్దరూ ఏవో ప్రశ్నలు వేశారు వాసంతి నెమ్మదిగానే సమాధానాలిచ్చింది

"ఈ అమ్మాయి నిజంగా బి ఏ చదివిందా?" అన్న అనుమానం వచ్చి ఏదో అనబోతుంటే వనజ "మా ఆడపడుచు లక్ష్మి క్లాస్‌మేట్ కూడారా" అని చెప్పింది

కిరణ్ నోట్లో మాట నోట్లోనే ఆగిపోయింది వాసంతి వెళ్ళిపోయింది

"పిల్ల మహాబాగుందిరా" అని వాళ్ళు అంటుంటే అప్పటికే కిరణ్ మనసు "హా! వాసంతీ" అంటూ ఆ అమ్మాయి వెంటబడి పరిగెత్తుకుంటూ వెళ్ళిపోయింది

పెళ్ళి నిశ్చయమైంది తిరపతిలో పెళ్ళి చేస్తాం మొక్కు ఉంది అన్నారు

కిరణ్ ఎగిరిపడి "రాట్ వీల్లేద"న్నాడు

"మొక్కు బాబూ! చెల్లించకపోతే మంచిది గాదు" అన్నారు నీళ్ళుగారిపోతూ

తిరుపతిలో చేసుకోవటం ఇష్టం లేదు కిరణ్ కి అలాగని వాసంతిని ఒదులుకోడానికి సిద్ధంగా లేదు అతను ఇలా మధన పడుతూండగానే మళ్ళీ కబురొచ్చింది

ఈ మొక్కు గురించి బంగారం లాంటి పిల్లాడిని వదులుకోడానికి ఇష్టపడని బామ్మగారు ఏడుకొండలవాడికి దణ్ణంపెట్టి "పెళ్ళిచేసి ఇద్దర్నీ కొండకి పంపిస్తాను మన్నించు" అంటూ దేవుడినే శరణు జొచ్చటంతో కిరణ్ ఊపిరి పీల్చుకున్నాడు

పెళ్ళయిపోయింది బామ్మగారు తిరుపతి అంటుంటే 'వెడతాం' అంటూ అప్పటికి దాటేశాడు తర్వాత ఆషాఢ మాసం వచ్చింది శ్రావణమాసంలో 'నోములు పట్టించాలి' అంటూ ఇంకో అడ్డు పుల్లేసింది

ఆషాఢ మాసాన్నే తిట్టుకుంటున్న కిరణ్ శ్రావణమాసం అంటూ మళ్ళీ ఆలస్యం చెయ్యటంతో తల్లి దగ్గర ఎగిరిపడ్డాడు "అందుకే ఆ చాదస్తపు పల్లెటూరమ్మాయిని చేసుకోను అని మొత్తుకుంది ఆవిడగారి పూజలు, వ్రతాలు అంటూ యిప్పుడే ముసల్దయి పోతుంది" అంటూ—

"ఆచారాలు బాబూ" అంటూ కమలమ్మగారు ఊరడించింది

వాసంతి కాపురానికి వచ్చింది రాగానే మొట్ట మొదటి ప్రశ్న "తిరుపతి ఎప్పుడు వెడదాం?"

కిరణ్ ఎలాగో వాసంతిని ఏమార్చాడు బామ్మగారు దిగబడి కిరణ్ ని ఓ గంటసేపు బ్రతిమాలి, తను దగ్గరుండి ప్రయాణం చేయించి, దేవుడి దర్శనం చేసి "ఆలస్యమైపోయింది స్వామీ! మన్నించు" అంటూ చెంపలేసుకుంటుంటే నిజం చెప్పద్దూ కిరణ్ కి మహా జాలి వేసింది

వాసంతికి ప్రతిరోజా నిద్ర లేవగానే స్నానంచేసి పూజ చేసుకోవటం అలవాటు చిన్నతనం నుండి ప్రతి నిత్యం ఇంటిదగ్గరున్న శివాలయానికి వెళ్ళి ప్రదక్షిణాలు చేసి దణ్ణం పెట్టుకొచ్చేది పెళ్ళి గొడవ ఎప్పటికప్పుడు వాయిదా వేస్తూ, బంధువులింట్లో వుండి బి, ఏ పాసయింది కాలేజీలో కూడా ఎవ్వరితో కలిసేది కాదు పిరికితనం అని అందరూ నవ్వేవారు మంచి సంబంధం కుదరక రెండేళ్లు ఉండిపోయింది వచ్చే సంబంధాలు బామ్మగారికి ఓ పట్టాన నచ్చేవి కావు

పొరబాటున బామ్మగారికి ఏదైనా సంబంధం నచ్చిందంటే అది కుదిరేది కాదు ఈ పల్లెటూరి పిల్ల, అమాయకప్పిల్లతో చాలా కష్టం సుమండీ! ఇంత నెమ్మత్తనం ఈ రోజుల్లో ఎందుకు పని కొస్తుదీ అని నాలుక చప్పరించేవాళ్ళు

ఆ సౌమ్యత, ఆ అమాయకత్వమే కిరణ్ ని ఆకర్షించి నాస్తికుడైనా, తన అభిప్రాయాలకు సరిపడకపోయినా, వాసంతిని పెళ్లి చేసుకునేలా చేసింది

ఎదుటివారి అభిరుచులను ఖండించినా అడ్డు పడేవాడు కాకపోవటం మూలాన వాసంతికి కష్టం అనిపించలేదు పూజ చేసుకుంటే దణ్ణం పెట్టుకోక పోయినా ప్రసాదానికి మటుకు రంచన్‌గా వచ్చి "నా ప్రసాదం" అంటూ చిన్నపిల్లాడిలా అల్లరి చేస్తాడు

వాసంతిని పెళ్ళి కావటం లేదని బామ్మగారు చాలా మొక్కులే మొక్కింది అందులో ఒకటి వాసంతినే స్వయంగా మొక్కుకోమంది శివభక్తురాలు కావటంతో 'భర్తతో శ్రీశైలం వస్తాను' అని మొక్కుక్కుంది

గుళ్ళూ, గోపురాలూ అంటేనే మండిపడే భర్తని తీసుకుని శ్రీశైలం ఎలా వెళ్లాలో తోచలేదు 'కావాలంటే ఒక్కత్తెవే వెళ్ళు' అన్నాడు

'జంటగా వస్తానని మొక్కుకుని ఒక్కదాన్ని ఎలా వెళ్లటం' వాసంతికి కోపం వచ్చింది భార్య కోపాన్ని ఏమాత్రం లక్ష్యపెట్టని కిరణ్ తేలిగ్గా నవ్వేశాడు

పెళ్ళయి మూడేళ్ళయినా వాసంతి కడుపు పండలేదు కమలమ్మగారు దిగులు పడిపోయింది "పుడతారు లేవోయ్ పిల్లలకేం భాగ్యం" అంటూ కిరణ్ తేలిగ్గా కొట్టిపారేస్తాడు

"చేసిన మొక్కే చెల్లించనప్పుడు ఏం పని జరుగుతుంది ఏం కలిసి వస్తుంది" వాసంతి అనుకుంటుంది మనసులో

ఏం కావాలన్నా ఇట్టే అమర్చే కిరణ్ ఈ చిన్న కోర్కె ఎందుకు తీర్చడో వాసంతికి అర్థంకాదు

ఏది ఏమైనా వాసంతి కోరిక కోరిగ్గానే మిగిలి పోయింది

* * *

కిరణ్ నిట్టూర్చాడు 'తనకు గుళ్ళూ గోపురాలంటే ఎందుకు అయిష్టమో వాసంతి కేం తెలుసు' అనుకుంటూ ఫోటో టేబుల్ మీద పెట్టేశాడు వాసంతికి ఈ పూజల పిచ్చేమిటో అర్థంకాదు

పెళ్ళయిన కొత్తల్లో ఇద్దరూ కూరల కోసం బజారుకు వెళ్ళారు "ఏమండీ! శంకర మఠం ఎప్పుడూ చూడలేదు గుళ్ళోకెడదాం" అంది ఆశగా

కిరణ్ ముఖం చిట్లించి 'అబ్బా' అనబోతుంటే "సరదాగా వెడదామండీ సినిమా కెళ్ళడం లేదా

పార్కుకి వెళ్ళడం లేదా!'' అంటూంటే కాదన లేకపోయాడు

తీరా గేటు దగ్గరికి రాగానే 'చెప్పులు పోతాయి నేను కాపలా కాస్తాను నువ్వెళ్ళిరా'' అన్నాడు

వాసంతి ఉత్సాహం మీద నీళ్ళు చల్లినట్ట యింది ''వద్దులెండి'' అంటూ గిర్రున వెనక్కి తిరగబోతుంటే వాసంతిని ఆపేసి భుజాలుపట్టి త్రోశాడు

వాసంతి వెళ్ళి గంటకొట్టి దణ్ణం పెట్టుకుని ఒక్క నిముషం అలా కూర్చున్నాననిపించి తిరి గొచ్చింది ఆ ముఖంలోని నిర్మలత్వం అంటే కిరణ్ కి ఎంతో ఇష్టం

''ఏమని దణ్ణం పెట్టుకున్నావు'' నవ్వుతూ అన్నాడు

''ఎందుకూ''

''తెలుసుకుందామని''

''నిజంగా చెప్తున్నాను మావారు నాస్తికులు నీ మీద ఏమ్మాత్రం నమ్మకంలేదు ఇక ఏజన్మలోనూ నన్ను ఆస్తికురాలుగా పుట్టించకు అని''

కిరణ్ చప్పున ఆగి ''అదేమిటి'' అన్నాడు ఆశ్చర్యంగా

''అంతకన్నా నేనేం చెయ్యగలను'' వాసంతి గొంతులో నిస్సహాయత

ఒక క్షణం భార్యని పరీక్షగా చూసి చప్పున భుజం పట్టి గిర్రున తిప్పేస్తూ ''పద! నేనూ వస్తాను మళ్ళీ వెడదాం'' అన్నాడు

''మీరు నా కన్నీళ్ళు తుడవడానికేం రానక్కర్లేదు'' చిరుకోపంగా అంది

కిరణ్ మెరుస్తున్నకళ్ళతో అన్నాడు ''ఎందుకు అక్కర్లేదు ఆ దేవుడి కన్నా నీ పతి దేవుడికి ఎక్కువ ప్రిఫరెన్స్ ఇచ్చావు కాబట్టి ఆ ఆనందం కోసమైనా వస్తాను'' అన్నాడు

భార్య తన్ని మారమనకుండా తననే మార్చ మని దేవుడిని కోరటం అతనికి అంతులేని సంతోషాన్నిచ్చింది

ఇద్దరూ వెళ్లారు కిరణ్ వాసంతితో పాటు బుద్ధిగా ప్రదక్షిణాలు చేశాడు వాసంతితో పాటు బుద్ధిగా గంటకొట్టి దణ్ణం పెట్టుకున్నాడు

వాసంతి అతని నుదుట అమ్మవారి కుంకుమ, శివుని విభూతి కూడా పెట్టింది ఇద్దరూ తీర్థం తీసుకుని అక్కడ కూర్చుని ఓ అరగంట సరదాగా మాట్లాడుకున్నారు

చివరికి లేస్తూ ''మీ దేవుడికి నా థ్యాంక్స్ చెప్పు'' అంటుంటే వాసంతి నవ్వింది ఎంతో అరుదుగా నవ్వే నవ్వది

ఆ రోజు సోమవారం వాసంతి సోమవారం నాడు చాలా నిష్ఠగా వుంటుంది ఒక్కపూటే భోజనం చేస్తుంది

కిరణ్ స్నానం చేసి పూజ గదిలోకి వెళ్ళాడు అప్పటికి నైవేద్యం పెట్టలేదు వాసంతి దేనికోసమో వంట గదిలోకి వెళ్ళింది భార్య లేకపోవటంతో పూజ అయిపోయింది కాబోలని అతను ప్రసాదం తింటు న్నాడు వాసంతికి విపరీతమైన కోపం వచ్చింది

''నైవేద్యం పెట్టావనుకున్నాను సారీ వాసంతీ'' అంటూ కంగారు పడిపోతూ టపటపా చెంపలు వాయించుకున్నాడు

# వాసంతి

అయినా వాసంతి కోపం తగ్గలేదు ఆరోజల్లా భార్య ముభావంగా ఉండేసరికి కిరణ్ కి దిక్కు తోచ లేదు రాత్రి వాసంతి సీరియస్ గా మాగ్ జైన్ చదువుకుంటోంది

కిరణ్ మంచంమీద కూర్చుని ''హరహర మహాదేవ! నా వల్ల ఒక పొరపాటు జరిగిపోయింది కనికరించు స్వామీ'' అంటూ నాటక ఫక్కీలో వేడుకున్నాడు అయినా వాసంతి పెదవి విప్పలేదు కిరణ్ ఊరుకోకుండా వాసంతి వెంటపడి చెవిలో జోరీగలా శంకర స్తోత్రం చేస్తుంటే వాసంతికోపం కరిగిపోయి పకపకా నవ్వేసింది

''నిజంగా శివశంకరుడున్నాడు'' కిరణ్ దణ్ణం పెట్టుకున్నాడు.

ఆ తర్వాత కిరణ్ పొరపాటున కూడా ప్రసాదం జోలికి వెళ్ళలేదు మరీ ఆగలేకపోతే వాసంతిని అడిగి గానీ తినేవాడు కాదు

* * *

వాసంతి కడుపుతో వుంది కాకినాడ నుండి ఆరోగ్యంబాగాలేదని వనజ వచ్చింది ఆమె ఇప్పుడు గర్భవతి కమలమ్మగారి సంబరం యింతా అంతా కాదు ఎన్ని అమర్చినా కోడలు దిగులుగా ఉన్నట్టే కన్పించేది చివరికి ఏం చెయ్యాలో తోచక కొడుకుతో చెప్పింది

## గుర్తుంచుకో...

మనసు లేని స్త్రీని ప్రేమించకు,
మనిషి లేని సంఘాన్ని వూహించకు,
తోటివాడి అభివృద్ధిని ద్వేషించకు,
మతం అనే ''మత్తు''లో పడి
మానవత్వపు విలువల్ని కోల్పోకు

— చశ్రీ

కిరణ్ వాసంతిని దగ్గిర కూర్చోబెట్టుకొని ''ఎందుకు వసూ దిగులుగా ఉన్నావట కడుపుతో ఉన్నవాళ్ళకి చాలా కోరిక లుంటాయిట ఏం కావాలో చెప్పు ఇంతవరకూ ఏమీ కోరలేదు'' అంటూ సతాయించాడు

''నిజంగా తీరుస్తారా '' వాసంతి అను మానంగా అంది

''ఓ యస్ '' అన్నాడు హుషారుగా

''నాకు శ్రీశైలం '' వాసంతి మాట పూర్తి కానేలేదు, కిరణ్ తుళ్లిపడ్డాడు ''అది తప్ప ఇంకేదైనా కోరుకో'' అన్నాడు

వాసంతి మాట్లాడలేదు ఆ తర్వాత రెండు మూడు సార్లు అడిగింది

భార్య కోరిక తీర్చాం గనగ సరే అన్నాడు వాసంతి ఆనందం పట్టలేక అతని చేతులు పట్టుకుని ఊపేసింది

''కానీ ఒక షరతు నేను నిన్ను తీసుకు వెడ తాను కానీ గుడి బైటే ఉంటాను నీతో బైట ఏ షికారైనా చేస్తాను గానీ, గుళ్ళోకి మాత్రం రమ్మనకు'' అన్నాడు

వాసంతి ముఖంలో ఆనంద ఆవిరైపోయింది ''జంటగా వస్తానని మొక్కుకున్నాను ఊహూ వద్దులెండి'' అంది

వాసంతి బామ్మగారు, తండ్రి రఘురామయ్య గారు వచ్చారు — శ్రీశైలం వెడుతూ వాసంతిని, కిరణ్ ని కూడా తీసుకెళ్ళాలని

వాసంతి ఎగిరి గంతేయబోయి ఆగిపోయింది భర్త ఒప్పుకోవద్దూ! 'రానంటారేమో' అనుకుంది దిగులుగా

రఘురామయ్యగారు కిరణ్ ని అడిగారు రమ్మ నమని

''వాసంతికి మొక్కుకూడా ఉందిగా నాయనా'' అంది బామ్మగారు

''ఏమనుకోకండి నాకు వీలుపడదు నాకు ఇటువంటి తీర్థయాత్రలంటే ఇష్టంలేదు మీ అమ్మాయిని తీసికెళ్ళండి'' అన్నాడు ఖచ్చితంగా

కమలమ్మగారు కూడా నచ్చ చెప్పింది ''నాకు కుదరదమ్మ ఈరోజు నేను క్యాంపుకి కూడా వెళ్ళాలి'' అనేశాడు

చేసేది లేక కమలమ్మగారు గొణుక్కుంది వనజ ఆరోగ్యం బాగా లేకపోవటం మూలాన ఆవిడ వెళ్ళడానికి వీలుకాలేదు

బామ్మగారు వాసంతినయినా రమ్మని మరీ మరీఅడిగింది వాసంతి అంగీకరించలేదు సాయంత్రం కిరణ్ కాంపుకి వెళ్ళే ముందు వాసంతిని పిల్చి రెండు వందలిచ్చాడు ''నాకు అర్జెంటుగా కాంపుకి వెళ్ళాల్సిన పని తగిలింది శ్రీశైలం చూడాలని ఉందన్నావుగా హాయిగా వెళ్ళి చూసిరా రెండు వందలు సరిపోతాయా'' అన్నాడు

వాసంతి ఆశ్చర్యంగా చూసింది ''మీరు లేకుండానా!''

కిరణ్ నవ్వుతూ వాసంతి తల నిమురుతూ ''నాతో పెట్టుకుంటే ఈ జన్మలో చూడలేవు నేను నాలుగైదు రోజులుదాకా రాను నీకూ కాస్త హుషారు వస్తుంది'' అన్నాడు నచ్చచెప్తూ

వాసంతి అతని చేతులు తొలగిస్తూ ఖచ్చితంగా అంది ''నేను ఒంటరిగా వెడతానని అనలేదు పెళ్ళయితే జంటగా వచ్చి దర్శనం చేసుకుంటానని మొక్కుకున్నాను'' అంది చిరుకోపంగా

కిరణ్ చిరాగ్గా ''డోంట్ బి సిల్లీ! ఫూలిష్ గా మాట్లాడకు ఆమొక్కుకునే దానివె ఏ కాశ్మీరో, ఊటినో వస్తానని మొక్కుకో లేక పోయావా?'' అంటూ పకపకా నవ్వేశాడు

వాసంతి అలా చూస్తూండగానే కిరణ్ కాంపుకి వెళ్ళిపోయాడు

''ఈయన గారిని ఒప్పించి శ్రీశైలం వెళ్ళా లంటే ఇంకో జన్మ ఎత్తాలేమో'' అనుకుంది బరువుగా

వనజని రమ్మనమని వాళ్ళ అత్తగారు ఉత్తరం వ్రాసింది ''కడుపులో ఉన్న పిల్లవు ఒట్టిచేతులతో ఎలా పంపను'' అంది కమలమ్మగారు

కిరణ్ కాంపు నుండి తిరిగి వచ్చేసరికి వాసంతి పడుకుని ఉంది ఇంటికొచ్చేసరికి శ్రీశైలం చూపిన

ఆనందమంతా నింపుకున్న ముఖంతో కళకళ్ళాడుతూ ఎదురు వస్తుందేమో అనుకున్న కిరణ్ తెల్లబోయాడు

"అలా ఉన్నావేం వసూ" కిరణ్ ఏదో అనే లోపే "బాగానే ఉన్నాను రండి స్నానం చేద్దురు గాని" అంటూ అక్కడి నుండి వెళ్ళిపోయింది

కిరణ్ స్నానంచేసి వస్తుంటే వనజ "అన్నయ్యా నేను రేపు వెళ్ళిపోతున్నానురా" అని చెప్పింది

"అప్పడే! అంత తొందరేమొచ్చింది "

"వాళ్ల అత్తగారు రమ్మని వ్రాసింది" అంటూ కొడుకుని ప్రక్కకు పిల్చి—

"ఒరేయ్ బాబూ! ఉత్తమనిషి కూడా కాదు చీరపెట్టి పంపకపోతే బాగోదురా"అంది ఆరాటంగా

"ఈ నెలాఖర్లోనా" అన్నాడు విసుగ్గా

"కడుపుతో ఉన్న మనిషిరా వాళ్లకి రకరకాల కోరికలుంటాయి" తల్లి సణిగింది

"చూద్దాంలే" కిరణ్ చిరాగ్గా గదిలోకి వచ్చాడు వాసంతి కాఫీ తెచ్చింది అతను ఏవో కాగితాలు చూస్తూ "ఇంతకీ దేవిగారి తీర్థయాత్ర విశేషాలు చెప్పనేలేదు" అన్నాడు నవ్వుతూ

వాసంతి ముఖం వాడిపోయింది కాఫీకప్పు నోటి దగ్గర పెట్టుకోబోతుంటే వాసంతి చెయ్యి అడ్డు వచ్చింది ఆ చేతిలో అతను శ్రీశైలం వెళ్లమని ఇచ్చిన డబ్బు ఉంది

"ఏమిటివి" కిరణ్ చురుగ్గా చూశాడు "నువ్వు శ్రీశైలం వెళ్లలేదా మీ బామ్మ వాళ్లతో, కనుబొమలు ముడిచాడు

"ఊహూ" వాసంతి వెళ్లలేదన్నట్టు తల అడ్డంగా ఊపింది

"ఎందుకని? వెళ్లమని చెప్పాగా!"

ఆగ్రహంగా అన్నాడు ఇంటికి వచ్చి రాకముందే తల్లి చెల్లెలికి చీర పెట్టాలిరా అంది కూర్చుని కూర్చోకముందే భార్య శ్రీశైలం వెళ్లలేదు అని అలక సాగించేసరికి అతనికి చిరాకేసింది

"ఒక్కదాన్నే వెళ్లటం ఇష్టం లేదని చెప్పాను గదండీ అత్తయ్యగారు డబ్బు కావాలంటున్నారుగా" అంటున్న వాసంతి అత్తగారు పిలవటంతో వెళ్లిపోయింది

అరగంట తర్వాత చేతిలో టిఫిన్ ప్లేటుతో వచ్చిన వాసంతికి కిరణ్ ఏవో పేపర్లు చూసుకుంటూ కనిపించాడు టేబిల్‌మీద పెట్టిన కాఫీ చల్లారిపోయింది వంద రూపాయల నోటు, రెండు ఇరవై రూపాయల నోట్లు టేబిల్ మీద గాలికి చెదిరి పడ్డాయి

"అదే! అదేమిటి! మీరు కాఫీ త్రాగలేదూ?" వాసంతి గాభరాగా అంది

"ఇప్పుడేమీవద్దు"కిరణ్ సీరియస్‌గా అన్నాడు

అతనికి కోపం వచ్చిందని వాసంతి గ్రహించింది "సారీ! మీరు లేకుండా ఎక్కడికీ వెళ్లటం నాకిష్టం లేదని చెప్పానుగదండీ!" అంది

ఆ కంఠంలో ఏ భావం ధ్వనించిందో కానీ కిరణ్ కోపం తగ్గిపోయింది

"వనజకి ఏదో ఒకటి, మీకు నచ్చిన చీర తీసుకు రండి ఈ నెలాఖర్లో మీ దగ్గర ఎలాగూ డబ్బు ఉండదు నిజం చెప్తున్నాను నాకేం కోపం లేదు"

వాసంతి నిండుగా నవ్వుతుంటే కిరణ్ రిలీఫ్‌గా చూశాడు

వాసంతి కాఫీ వెచ్చబెట్టడానికి వెళ్లిపోయింది

* * *

ప్రియమైన తమ్ముడు కిరణ్‌కి!

వసుధక్క ఆశీర్వదించి వ్రాయునది నీకిలా ఆఫీసుకే ఉత్తరం ఎందుకు వ్రాయవలసి వచ్చిందో చెప్తాను

నాలుగేళ్ళక్రితం మీ బావగారు తిరుపతి నుండి వస్తూ యాక్సిడెంట్‌లో పోయారని నీకు తెలుసు నా వయస్సు ఇప్పుడు 33 సంవత్సరాలు ఉద్యోగం చేసుకుంటూ బాబుని పెంచాలనుకున్నాను కానీ దైవ నిర్ణయం వేరేగా ఉంది

మా ఆఫీసులో ప్రసాద్ అనే అతనితో పరిచయమైంది అతను పెళ్ళంటూ చేసుకుంటే నన్నే చేసుకుంటానని పట్టుబట్టి కూర్చున్నాడు చాలా మంచివాడు నాకు పెళ్ళయి భర్తపోయాడని, ఒక బాబు కూడా ఉన్నాడని చెప్పినా వినలేదు ఆరు నెలల నుండి జరుగుతోందీ తతంగం అంతగా అతను నన్ను కోరుకుంటుంటే నా మనసూ నాకు ఎదురు తిరిగింది

మేమిద్దరం రిజిష్టర్ మారేజ్ చేసుకున్నాము ఈ రోజు బైలుదేరి తిరుపతి వెడుతున్నాము వచ్చేటప్పుడు అక్కడికి వస్తాము అమ్మకి నామీద కోపం రాకుండా ఏం చెప్పుకుంటావో నీ యిష్టం ఆవిడ ఒప్పుకోదని ముందుగా చెప్పలేదు నేను ఎన్నుకున్న మార్గం సరి అయినదే అనే నమ్మకంతో ఈ పని చేశాను

అమ్మకి నా నమస్కారములు వనజ కులాసాగా ఉందా? వాసంతి కులాసా అని తలుస్తాను వాసంతి కసలే మొహమాటం ఎక్కువ ఏదీనోరు తెరిచి అడగదు అందులో ఉత్త మనిషి కూడా కాదు ఆ అమ్మాయికేం కావాలో నువ్వే స్వయంగా అడిగి, అవి తీర్చడానికి ప్రయత్నించు ఇంతే సంగతులు

ఆశీస్సులతో

వసుధక్క

వాసంతి సంభ్రమాశ్చర్యాలతో "అబ్బ! ఎంత అదృష్టం మీకు సంతోషంగా లేదూ?"అంది

కిరణ్ వాసంతిని దగ్గరికి తీసుకుంటూ "అక్క జీవితం బాగుపడుతుందంటే నాకు మాత్రం సంతోషంగా ఉండదా వసూ! నీ ఆనందం ఒక్కమాటలో తేల్చావు కానీ నేను ఎలా చెప్పాలో నాకు తోచటం లేదు చిన్నవాళ్ళమైన నేనూ, వనజ హాయిగా కాపురాలు చేసుకుంటుంటే అక్కడ వసుధక్క ఒక్కత్తీ ఒంటరిగా బ్రతుకుతోందని గుర్తుకు వస్తే ఎంత బాధగా ఉంటుందో తెలుసా ?" అన్నాడు అతని గొంతు జీరబోయింది

వాసంతి కళ్లు కూడా చెమ్మగిల్లాయి

"పద! ఈ ఆనందం పంచుకోవాల్సిన మొట్టమొదటి వ్యక్తి అమ్మ" అన్నాడు

కమలమ్మగారు మ్రాన్పడిపోయింది "లోకం" అంటూ ముక్కుమీద వేలేసుకోబోయి ఆగిపోయింది

"ఏమిటమ్మా! వెధవలోకం దానికి భయపడేదేమిటి" కిరణ్ ఓ అరగంట లెక్చరిచ్చి ఓదార్చాడు

"పోనీలే! దాని బ్రతుకు ఓ దారిన పడితే నాకు మాత్రం సంతోషం కాదా! అలాగనే కదా నేను రోజు ఆ ఏడుకొండలవాడికి మొక్కుకునేది" అంది చివరకు ఆయనదే భారమన్నట్టు

"నిజం సుమండీ " వాసంతి వికసించిన ముఖంతో ఏదో అనబోయింది

"వెధవ సెంటిమెంట్సూ మీరున్నూ" కిరణ్ విసుక్కున్నాడు

ఆ సాయంత్రం ఇద్దరూ డాక్టర్ దగ్గరకి వెళ్లారు

"అంత నీరసంగా ఉన్నావేం తిండి తినటం మానేశావా? లేక మీ ఆయనేమైనా దెబ్బలాడాడా?" నవ్వుతూ అంది డాక్టరు విజయలక్ష్మి

కిరణ్‌కి బాగా తెల్సిన డాక్టరామె

కిరణ్ వాసంతి వైపు చూసి చిన్నగా నవ్వి "మరే డాక్టర్! నాకిది కావాలి అని నోరు విడిచి చెప్పట్లేదు" అన్నాడు

"నీ వేవిళ్ల కోరికలన్నీ ఇప్పుడే తీర్చేసుకోవాలమ్మా" ఆవిడ హాస్యం చేసింది

"ఎంత మొత్తుకున్నా చెప్పట్లేదు డాక్టర్ అడిగీ అడిగీ నాకు కంఠశోష రావాల్సిందేగానీ ఆవిడగారు నోరు విప్పదు మా వనజ తెల్సుగా డాక్టర్ అమ్మా, నాకు అప్పడాలు కావాలి అంటూ మొదలు పెట్టిందంటే చాక్లెట్స్ వరకూ లిస్ట్ చెప్పేది ఈవిడగారేమో అయిదునెలలైనా ఇది కావాలి అని నోరు విప్పదు "

కిరణ్ ఫిర్యాదుగా అన్నాడు కానీ ఆ మాటల్లో ధ్వనించిన బాధ, చిరాకు డాక్టర్ పసిగట్టేసింది



"నువ్వు మనసులో అలా దాచుకుంటే ఎలా వాసంతీ ? నీ కోరికేమిటో చెప్పు ఈ టైమ్‌లో ఎంత హుషారుగా ఉండాలి" అంది

"నాకే కోరికా లేదు డాక్టర్ నోరు విప్పి అడక్కుండానే అన్నీ అమరుస్తుంటే నేనింకా ఏం కోరుకునేది" వాసంతి మృదువుగా అంది

వాసంతి మాటలు మామూలుగా ఉన్నా కిరణ్ గుండెల్లో ములుకుల్లా గుచ్చుకున్నాయి ఆ మాటల్లో నా కోరిక తీర్చలేదు ! అన్న భావం బాగా ఇమిడి ఉంది

"ఏది ఏమైనా ఆవిడ ఏ చీకూ చింతాలేకుండా సుఖంగా ఉండేట్టు చూడాల్సిన బాధ్యత నీది కిరణ్ " అంది డాక్టర్

తిరిగి వస్తుంటే "నిజంగా నీకే కోరికా లేదా వసూ" అన్నాడు

"తీరే కోరికయితే కోరిక అని చెప్పచ్చు తీరని దానిగురించి కోరిక అని మభ్యపెట్టుకోవటం నాకు ఇష్టంలేదు" మృదువుగా అంది వాసంతి

*         *         *

వసుధ, ప్రసాద్ వచ్చారు ప్రసాద్ చాలా మంచివ్యక్తి ముఖ్యంగా కిరణ్ కి బాగా నచ్చాడు

వాసంతి కోరిక, కిరణ్ చిరాకు విన్న వసుధ తెల్లబోయింది చిన్నబోయిన ముఖంతో తల దించుకుని ఉన్న వాసంతిని చూసి వసుధ మనసు ఆర్ద్రమైంది "నీకు తెలీదు కదూ వాసంతీ కిరణ్ చిన్నతనంలో దేవుడంటే దణ్ణం పెట్టుకునే వాడు పెద్దవాడయింతర్వాత చిత్రంగా 'అ దేవుడులేడు దెయ్యంలేదు " అనేవాడు అటు వంటి సమయంలో తిరుపతి నుండి వస్తూ మా వారు పోయారు రెండునెలలు గడవనేలేదు శ్రీశైలం క్యాంపునుండి వస్తూ మా నాన్నగారు యాక్సిడెంట్‌లో పోయారు మేమంతా ఖర్మ అని సరిపెట్టుకున్నాం కానీ చిత్రంగా వాడు అప్పటి నుండీ పూర్తిగా నాస్తికుడైనాడు ముఖ్యంగా తిరుపతి, శ్రీశైలం అంటే మరీను నట్టేట్లో మునిగిపోయిన ఈ సంసారాన్నిఒడ్డుకి లాగడానికి వాడెంత తిప్పలు పడ్డాడో ఆ దేవుడికి తెలుసు" అంది వసుధ కళ్ళు ఒత్తుకుంటూ

అసలే సున్నితమైన వాసంతి మనసు మరీ ఇదయిపోయింది బైటకి చెప్పకోలేని భర్త బాధ ఇదా పాపం ! అనిపించింది

అయినాసరే ఎప్పుడూ అశుభమే జరుగుతుందని ఎందుకనుకోవాలి ? అతను ఒట్టి భ్రమలో ఉన్నాడు అనుకుంది

వసుధ, ప్రసాద్ వెళ్ళిపోయారు

వాసంతి నీరసంగా మంచంమీద పడుకుండి పోయింది సాయంత్రం కిరణ్ వచ్చి పడుకున్నభార్యని చూశాడు అతని కళ్ళు కుచించుకుని మళ్ళీ వెడల్పయినాయి వాసంతిలో ఏమాత్రం చలాకీతనం లేదు

డాక్టర్ విజయలక్ష్మి మాటలు గుర్తొచ్చాయి "ఈ సమయంలో ఆడవాళ్ళు చాలా కోరుకుంటారు వాటిని తీర్చాల్సిన బాధ్యత మీకుంటుంది అందులో ఫస్ట్‌టైమ్ అసలు కాదనకూడదు" నవ్వుతూ సలహా యిచ్చింది

## వా స ం తి

"ఒరేయ్ కిరణ్ ! గర్భిణీస్త్రీలకి చాలా కోరిక లుంటాయి మన వనజ ఎలా ప్రాణం తీసేదో తెల్సుగా వాసంతేమిటి అలా ఊరుకుంది అందరూ మన వనజలాగే దెబ్బలాడి సాధించలేరు అన్ని కోరికలు బైటకి చెప్పకోలేరు కడుపుతోఉన్న స్త్రీ మానసికంగా బాధపడటం మంచిదికాదు దిగుళ్ళూ విచారాలు ఉండకూడదు "

వసుధ వెళ్ళేముందుకూడా హెచ్చరించేవెళ్ళింది

నిజమే ! పిచ్చి వాసంతి ! తనకంటూ అది కావాలి, ఇది కావాలి అని ఏమీ అడగదు అడిగిందల్లా ఒక్కటే శ్రీశైలం చూపించరూ అని పెళ్ళయి నప్పటినుండీ ఆ కోరిక అలా ఉండిపోయింది! పైగా ఏదో మొక్కుట

అయిదునెలలు గడుస్తున్నా తనని ఏమైనా కోరిందా! పోనీ అడిగిన ఆ ఒక్క కోరికయినా తను తీర్చాడా ?

భర్త తిరుపతిలో మరణించిన వసుధ మళ్ళీ పెళ్ళి చేసుకుని తిరుపతే వెళ్ళింది లోపం ఎక్కడుంది?

ఎందుకో కళ్ళు తెరిచిన వాసంతి పరధ్యానంగా నిలబడిపోయిన భర్తనిచూసి ఉలిక్కిపడి లేచింది

"అరే ! అలా నిలబడ్డారేం ! ఎంతసేపయింది వచ్చి నేను చూడనేలేదు పిలవకూడదా" అంటూ హడావిడిగా మంచందిగి వచ్చింది

ఈ మూడు నిముషాల్లోనే భార్య తనగురించి అంత ఆరాటపడిపోయింది మరి ఈ మూడేళ్ళ దాంపత్యంలో ఆమె ఆరాటాన్ని తను అర్ధం చేసు కున్నాడా ? ఈ విషయంలో తన మొండితనం, నమ్మకం గొప్పవా? భార్య తనపట్ల ప్రదర్శించే ఈ ప్రేమాభిమానాలు గొప్పవా ?

"కాఫీ తీసుకోండి ఏమిటో అలా మొద్దులా పడుకుండిపోయాను" అంది బాధపడిపోతూ

ముఖం కడుక్కుని బొట్టు పెట్టుకుందేమో! ఫ్రెష్‌గా కనిపించింది కిరణ్ భార్యవైపు ఆరాధనగా చూశాడు

రెండురోజుల అనంతరం !

### ఆ తరువాత నీ యిష్టం !

కోపం
పెత్రెడిన్ లాంటిది !

ద్వేషం
ఆర్సెనిక్ ఆక్సైడ్ లాంటిది !

స్వార్థం
పొటాషియమ్ సయనైడ్ లాంటిది !

ప్రేమ
ఆక్సిజన్ లాంటిది !

క్షమ
సలైన్ వాటర్ లాంటిది !

త్యాగం
గ్లూకోజ్ యింజక్షన్ లాంటిది !

— డా గుమ్మనూరు రమేష్‌బాబు

రాత్రి భోజనాలయినాయి వాసంతి తీరిగ్గా కూర్చుని మాగ్‌జైన్‌లో బొమ్మలు చూస్తోంది కిరణ్ వాసంతి ప్రక్కన కూర్చుని "వసూ" అని పిల్చాడు

వాసంతి మాగ్‌జైన్ ప్రక్కన పడేసింది

"నువ్వు నన్ను చాలాచెడ్డవాడిని చేస్తున్నావు "

వాసంతి కనుబొమ్మలు పైకి లేచినాయి "ఏమిటీ" అన్న ఆశ్చర్యం కదలాడిందా చూపులో

"అవును ! నువ్వో బుద్ధిమంతురాలివీ, నేనేమో బాగా చెడ్డవాడిని" కిరణ్ మూతి బిగించి అన్నాడు

"అలా అని ఎవరన్నారుట" వాసంతి నవ్వింది

"ఎవరో అనేదేమిటి ! స్వయానా నాకు అక్కగారు, నీకు వదినగారూ అయిన వసుధే అన్నది నీ కిప్పటికి అయిదోనెల కూడా దాటబోతూంది కదా నువ్వు నన్ను ఒక్కకోరికైనా కోరావా ? పోనీ కోరావే అనుకో తీర్చమని దెబ్బలాడావా" అన్నాడు

వాసంతి ముఖం వాడిపోయింది చప్పున లేచి అక్కడున్న మాగ్‌జైన్స్ టేబుల్‌మీద సర్దసాగింది మొదటినుండీ బొమ్మకొంగు పట్టుకుని తిరగటం అలవాటైన వాసంతికీ, ఈ గుళ్ళూ, గోపురాలు, పూజలూ వ్రతాలంటే ఎనలేని ఇష్టం చచ్చేంత సరదా దానికితోడు అపారమైన నమ్మకం

"నీకే కోరికా లేదా వసూ" లాలనగా అడిగాడు

లేదన్నట్టు తలూపింది

"నిజంగా ! అలా అని నోటితో చెప్పు "

"నిజంగా నాకే కోరికాలేదు" అలా అంటోంటే వాసంతి కంఠం వణికింది కళ్ళల్లో గిర్రున నీళ్ళు తిరిగాయి కిరణ్ దగ్గరికి వస్తాడేమో అని ఎదురు చూసిన వాసంతికి నిరాశే అయింది

కిరణ్ మౌనంగా బీరువా తెరిచి వాసంతి బట్టలు, తన బట్టలు మడతపెట్టి సూట్‌కేస్‌లో సర్దుతున్నాడు

వాసంతి కళ్ళు వెడల్పు చేసుకుని చూస్తూ "ఇప్పుడెందుకు" అంది

కిరణ్ తలెత్తి "నిజమే ! ఇన్నాళ్ళూ నేను మూర్ఖంగానే ప్రవర్తించాను అందుకే శ్రీశైలం ప్రయాణమై వెడుతున్నాను రేపు ఉదయాన్నే" అన్నాడు

"క్యాంపా" వాసంతి గొంతులో ఆశ

"కాదు నా ముద్దుల భార్య వాసంతి కోరిక తీర్చడానికి భయపడకు గుడిబైటే వదిలెయ్యనులే నీతో గుడిచుట్టూ ప్రదక్షిణాలు చేస్తాను దణ్ణం పెడతాను అభిషేకం చేస్తాను "

కిరణ్ అంటున్నదేమిటో అర్థమైన వాసంతి సంభ్రమంగా చూసింది ఇన్నాళ్ళకి ఆ ముఖంలో ఎన్నడూ చూడని వింత మెరుపుల్ని కిరణ్ ఇప్పుడే చూశాడు

కిరణ్ పెదవులు చిరునవ్వుతో విచ్చుకున్నాయి

"శ్రీశైలమా ? నిజంగా " వాసంతి సంభ్రమంగా దగ్గరికి వచ్చి చప్పున అతని భుజం మీద వాలి బావురుమంది

"నిజంగానే ! పాప పుడితే పార్వతి బాబు పుడితే మా నాన్నగారి పేరు శివా " కిరణ్ అల్లరిగా నవ్వాడు

తడిసిన కనురెప్పలు రెపరెపలాడిస్తూ ఫక్కున నవ్వింది వాసంతి






## కొరగాని "మెడల్!"

1971 లో యుద్ధంలో వీరమరణం పొందిన బన్వారీలాల్ అనే అతనికి "వీరచక్ర్" మెడలు నిర్ణయించి అది అతని భార్య రామ్లికి ఢిల్లీలో పెద్ద వేడుకల మధ్య బహూకరించారట ఆమె భర్త వీరుడని, త్యాగి అని, ఆమెకు పదహారెకరాల భూమి ప్రభుత్వం యిస్తుందనీ, అంతేగాక ఆమె కొడుకూ కూతురూ చదువులు ప్రభుత్వమే భరిస్తుందనీ ఒక యిల్లు కూడా వుచితంగా యిస్తుందనీ, పిల్లల చదువులయ్యాక వారికి వుద్యోగాలు కూడా యిస్తుందనీ ఆనాడు టోకున వరాలిచ్చిన ప్రభుత్వం గత పదకొండేళ్ళుగా కిమ్మనకుండా వూరుకుందనీ ఆవిడన్నదట తనకు చివరికో నౌకరుద్యోగం కూడా దొరకలేదనీ, యీ పదకొండేళ్ళ దుర్భలదారిద్యంలో విద్యాహీనులై పిల్లలిద్దరూ పాడైపోయారనీ, ఎందుకూ కొరగాని (తన భర్త పేరున తనకిచ్చిన) ఆ "మెడలు" రాష్ట్రపతికిగాని, రాష్ట్ర గవర్నరుకు గానీ తిరిగిచ్చెయ్యాలనామె రాష్ట్ర గవర్నరు డా మర్రిచెన్నారెడ్డిని కలుసుకోడానికి వచ్చిందట.

## కొత్తరకం వాచీలు!

అమెరికాలో వో ప్రసిద్ధ వాచికంపెనీ ఆడవారి కోసం వో కొత్తరకం వాచి కనిపెట్టారట అది చేతికి కట్టుకుంటె వారు బహిష్టయ్యేకాలం, గర్భిణి అయ్యే కాలం అందులో తెలుస్తుందట ఈ వాచికి "ఫెర్రిలిట్రాన్" అని పేరెట్టారట. జపానుదేశం "డిజిటల్ వాచ్" అనే వో కొత్తరకం వాచిని కనిపెట్టారట అది ఇంగ్లీషు భాషను జపాను భాషలోకి అనువదిస్తుందట వ్యాపారానికి, ప్రయాణానికి సంబంధించిన సమాచారంల 1666 ఇంగ్లీషు మాటలనూ ఆ వాచిలో ఎలక్ట్రానిక్స్ మూలంగా నిక్షిప్తం చేశారట ఈ వాచీ పెట్టుకు వెళ్తే జపాను భాష మాట్లాడితే ఇంగ్లీషులోకి ఇంగ్లీషు మాట్లాడితే జపాన్ భాషలోకి అనువదించి మనకు ఎలా కావాలంటే అలా చూపుతుందట—ఇదంతా ఎందుకు? పరీక్షలో ప్రశ్నాపత్రం చూపిస్తే టక్కున సమాధానాలు చూపించే రకం వాచీ తయారు చేయరాదూ, విద్యార్థులు విరగ బడ్తారవి కొనడానికి.

## అమ్మాయిని రక్షించిన ఆడపోలీసు!

సెప్టెంబరు 14 వ తేదీన అనంత లక్ష్మి అనే ఆడ పోలీసు ఒకామె కోయంబత్తూరు నుంచి పొల్లాచి బస్సులో వెళ్తుండగా ఆ బస్సును వో ఎంబాసిడరు కారు దాటిందట. ఆ కారుకేసి యధాలాపంగా చూసిన అనంతలక్ష్మి కారు వెనకసీటులో యిద్దరు మగవాళ్ళతో ఒకమ్మాయి పెనుగులాడుతూనట్లు లీలగా కనుపించిందట దాంతో ఆమె ఎగిరి గంతేసి బస్సు డ్రయివర్కు బస్సు వేగంగా నడిపి ఆ కారును దాటి, దాన్ని ఆపు చేయమన్నదట బస్సు డ్రయివరు కారును ఆపు చేసేసరికా అనంతలక్ష్మి చెంగున గంతేసి ఆ మగవారిని నిలదీసి విషయం అడిగిందట గోవిందరాజులు అనే అతను ఆమెకు బంధువట ఆమెను ప్రేమించాడట కానీ పెళ్లి వేరే అతనితో నిశ్చయమయ్యేసరికి కోపం వచ్చి తన్ను ఎత్తుకు పోతున్నాడని చెప్పిందట అనంతలక్ష్మి ఆ దుండగులను స్టేషన్లో వప్పగించి, ఈ అబలను కన్నవారికి చేరేసి, అందుగ్గాను తన డిపార్టుమెంటు నుంచి నూటయాభై పారితోషిక మందుకున్నదట

## గుర్రపు స్వారీ లైసెన్సు!

పశ్చిమ జర్మనీలో గుర్రపు స్వారీ చేయడానికి లైసెన్సు కావాలనే కొత్త రూలు ప్రవేశపెట్టారట ఈ లైసెన్సు యిచ్చేవారు నానా తంటాలూ పడుతున్నారట గుర్రపు స్వారీ లైసెన్సుకోసం కుప్పలు తెప్పలుగా జనులు వచ్చి పడుతున్నారట ఈ గుర్రపు స్వారీకి వో సంఘం ఉందట ఈ సంఘంలో నాలుగు లక్షల నలభై ఆరువేలమంది సభ్యులు వున్నారట

## రహస్య ప్రణయం — వంశనాశనం!

సేలం మణక్కాడు అనే వూరికిచెందిన 20 ఏళ్ళ సుబ్రమణి అనే అతను బీబి అనే ముస్లిము యువతిని ప్రేమించి, ఆమెకోసం తన మతంమార్చుకుని ఆమెను పెళ్లి చేసుకుని, యీ పదేళ్లలో ముగ్గురు పిల్లలను కన్నాడట ఇన్నాళ్ళు సుఖసంసార జీవితం చేసిన అతని జీవితంలో యీనాడు విషాదం చెలరేగింది తన భార్య ఎవరితోనో రహస్య ప్రేమాయణం పెట్టుకున్నట్లు గ్రహించిన అతను ఆరలు తీస్తే ఆమె సేలం సెంట్రలుజైలు వాచ్‌మన్ కొడుకుతో అక్రమసంబంధం పెట్టుకున్నట్టు తేలిందట ఈవిషయంలఆమెతోనిక్కచ్చిగామాట్లాడి జరిగినదేదో జరిగిందియికమీదైనా పిచ్చివేషాలు మాను అని హెచ్చరించాడట ఇహెలా భర్తకు తెలిసిందని ఆమె తన ప్రియుణ్ణి యధేచ్చగా యింట్లోనే కలుసుకో నారంభించిందట ఒకనాడు తెలవారుజామున పనియించి తిరిగొచ్చిన అబ్దుల్లా నసుద్ (సుబ్రహ్మణ్యంముస్లిమ్ పేరు) తన భార్య పరాయివాడిపక్కలోకులకడం చూసి, పక్కనున్న గడ్డపార తీసుకున్నాడా పడేసరికా ప్రియుడు చేతికందకుండా పారిపోయాడట కోపంతోతిరిగివచ్చినతను రెట్టింపు ఆవేశంతో తన భార్యబుర్ర బద్దలుకొటి చంపి, అంతతో ఆగక ముగ్గురు పిల్లలను కూడా అదే విధంగా బుర్రలు పగలగొట్టిచంపి, తాను పోలీసులకు లొంగిపోయి, జైలులోగొంతు పిసుక్కుని ఆత్మహత్య చేసుకున్నాడట.



# టికెట్‌లెస్ ట్రావెల్

## వింధ్యవాసిని




అది హిందూపూర్ రైల్వే స్టేషను.

వెంకట్రామయ్య ఇంట్లో కమ్మని విందు ఆరగించిన భుక్తాయాస మింకా తీరలేదు. "మీరు బండెక్కండి సార్, నేను టికెట్ తెస్తా" అని వెళ్లిన పెద్ద మనిషి ఏడీ? అని విసుగ్గా ఒకసారి వాచీ చూసుకుని, కిటికీ లోంచి బయటికి చూస్తూ కూర్చున్నాను.

ఎక్స్‌ప్రెస్‌లో ఇవాళ అంతగా రష్ లేదు. ఒకసారి చుట్టూ చూశాను. ఎదురుగుండా ఉన్న సీట్లో ఒక అందమయిన వయసులో ఉన్న అమ్మాయి, పక్కనే వాళ్ళమ్మగారు కాబోలు కూర్చుని ఉన్నారు అమ్మాయి ముఖం ఎలా ఉందో చూద్దామంటే వాళ్లమ్మ ఆమె తల ఎత్తనిచ్చేలాగా లేదు పెద్దావిడ పక్కన కొంచెం స్థలం వదిలి కూర్చుని ఉన్న మాసిన బట్టల గడ్డం మనిషిని చూస్తే దొంగలా ఉన్నాడు.

'జాగ్రత్తగా వుండాలి భుక్తాయాసంతో కళ్ళు మూస్తే, సూట్‌కేసు తీసుకుని ఏ మధ్య స్టేషన్లోనో రైలు దిగి ఉడాయించ వచ్చు వీడు'' అనుకున్నాను. వెంటనే పైన బెర్తుమీదున్న సూట్‌కేస్ దింపి, కాళ దగ్గిర సీటుకింద దూర్చాను ఇది కాస్త అనాను

కూలమే. కానీ అనుకూలం కన్నా, జాగ్రత్త ముఖ్యం కదా!

జేబులోంచి దువ్వెనతీసి క్రాపు దువ్వుకుని ఇన్‌షర్ట్, బూటు లేసులు సరిగా ఉన్నాయో లేదో పరీక్షించి చూసుకున్నాను.

ఎదురుసీటు అమ్మాయి ఒక్కసారయినా తల ఎత్తి ఇటుచూస్తే బావుండు అనుకుంటూ వుండగానే వెంకట్రామయ్య ఒగురుస్తూ, పరిగెత్తుకొని వచ్చాడు.

"ఇదిగో టిక్కెట్టు తీసుకోండి సార్" అన్నాడు లాల్చీ జేబులో చేయి పెడుతూ,

"ఎంతయిందేమిటి?"

"ఎంతోనా? దాంతో ఏమిలెండి. అలాగే దయచేసి ఈ కవర్ కూడా" రహస్యంగా అంటూ తెల్ల కవర్ ఒకటి అందించాడు.

అందులో కనీసం అయిదు వందలు ఉండొచ్చని నా అంచనా. లంచం తీసుకోవటం నాకు ఇష్టంలేదు కానీ ఏం చెయ్యను? ఈ వెంకట్రామయ్య ఒట్టి జిడ్డట! ఇవ్వగానే తీసుకోకపోతే, వెంటబడి రైలెక్కి వచ్చినా వచ్చేస్తాడు.

మౌనంగా రెండూ అందుకుని పాంటు జేబులోకి తోసాను, 'లంచం తీసుకోవటం తప్పే! కానీ నేనేం ఒడిసి వసూలు చేసుకోటం లేదే అతనే ఇస్తున్నాడు- తీసుకున్నాను, అంతే' అనుకుంటూ.

సిగరెట్ తీసి, పెదాలమధ్య ఉంచుకుని అగ్గిపెట్టెకోసం తడుముకున్నాను దొరికింది కాదు. వెంకట్రామయ్య తన జేబులోంచి తీసి ఇచ్చాడు. సిగరెట్ పీల్చి పొగ వదిలాను. ఈ వెంకట్రామయ్య పుణ్యమా అని మూడు రోజుల హిందూపూర్ క్యాంపు, ఏ ఇబ్బంది లేకుండా ముగిసింది బస, భోజనం రెండూ ఆయన ఇంట్లోనే. హోటల్లో వుంటానని అన్నా వెళ్ళనిచ్చాడు కాదు.

"నేను వచ్చేవారంలో అనంతపూరొస్తాను సార్. అప్పటికి మా ఫైలు..."

"అలాగేలెండి. మీరేం వర్రీ అవనక్కర్లేదు నేను వెళ్ళగానే ముందు మీ పేపర్లే చూసి, కలెక్టర్‌గారికి రెకమెండ్ చేస్తాను. సరేనా?"

గార్డు విజిల్ కొట్టడమూ, రైలు కూత వేయటమూ ఒక్కసారే వినిపించాయి. సెలవు తీసుకుని, కదిలిన రైలుకి దూరం అవుతున్న వెంకట్రామయ్య మీది మంచి దృష్టి ఇటు మరల్చి చూశాను. వీళ్ళంతా ఇప్పుడు ఎక్కారోగానీ మా కంపార్ట్‌మెంటు అంతా నిండుగా వుంది సీట్లన్నీ నిండిపోయి, ఒక ముసలమ్మ కిటికీ దగ్గర కిందే కూర్చుని ఉంది.

తైల సంస్కారం లేని జుట్టు, మాసి చిరిగిపోయిన దుస్తులు,ఒంగిపోయిన నడుము, ఆ ఎముకల గూడు అవతారం చూస్తే, అడుక్కు తినేదిలా గుంది ముసలమ్మ. 'టికెట్ లెస్' బాపతుకాబోలు అనుకున్నాను. కానీ మామూలుగా ఆ రకం మనుషుల్లో కనిపించే ధీమా, తెగింపు ఈమెలో లేవు. భయం భయంగా దిక్కులు చూస్తూ కూర్చుని ఉంది. ఆమె చూపులు చూస్తే రైలెక్కటం ఇదే ప్రథమం కాబోలు అనిపించింది.

అటుపక్క సీటుమీద రైలు కదిలేముందు ఎక్కిన కాలేజీ స్టూడెంటులాంటి అబ్బాయి కూర్చొని ఉన్నాడు. అతగాడి చూపులు ఎదురుగా ఉన్న అమ్మాయిమీదే కేంద్రీకరించి ఉండటం గమనించాను. 'వీడు నాకు పోటీ కాబోలు!' అనుకుని నవ్వుకున్నాను. తప్పేముంది? ఇల్లు, ఇల్లాలు, సంసారం— అన్నీ ఉన్న నేనే, ఇల్లు వదలి బయటకు రాగానే అన్నీ మరచి కుర్రచేష్టలు మొదలు పెడితే, ఇక కుర్రవాడు దొంగచూపులు చూడటంలో వింత ఏముంది? అనిపించింది.

చలువ కళ్ళజోడు తీసి, జేబులోదాచుకుని న్యూస్‌పేపరు విప్పాను ఇంతలో టికెట్ కలెక్టర్ వచ్చాడు. ఉన్న సీట్లలోనే ఎలాగో కొంత చోటు చేసుకుని కూర్చున్నాడు. ఎందుకంటే ఈ బోగీలో మావే చివరిసీట్లు. పెనుగొండలో రైలు ఆగేదాకా అతనిక్కడే కూర్చుంటాడు.

టి. సి. కి దాదాపు నలభయి సంవత్సరాల వయసుంటుంది నల్లకోటు జేబుకి ఉన్న ప్లాస్టిక్ స్ట్రిప్‌మీద పి. బాలసుందరం అని ఇంగ్లీషులో వ్రాసి ఉంది. శుభ్రంగా ఉన్న తెల్లని పాంటు, నిగనిగలాడే బూటు వేసుకుని ఉన్నాడు. కళ్ళద్దాలు, మీసాలవల్ల వయసు హెచ్చుగా కనిపిస్తోందేమో అనిపించింది.

ఒక్కొక్కరి టిక్కెట్టు తీసుకుని, పరీక్షగా చూసి, సంతకం చేసి, వాపస్ ఇచ్చేస్తున్నాడు. చివరగా నాది అయిన తరువాత, కిటికీదగ్గర కింద కూర్చున్న ముసలమ్మవంతు వచ్చింది.

టి. సి. వచ్చి ఇక్కడ కూర్చున్నప్పటి నుంచీ, వంచిన తల ఎత్తలేదు ముసలమ్మ. నా అనుమానం మరింత బలపడింది.

"ఇదిగో అవ్వా టికెట్ ఇవ్వు" అన్నాడు టి. సి.

అంతే! గొల్లుమని ఏడవటం మొదలు పెట్టింది ముసలామె ఆమె దగ్గర టికెట్ లేదని అందరికీ తెలిసిపోయింది

టి. సి. కి కోపం వచ్చి బాగా తిడతాడను కున్నాను. కానీ, అలాంటిదేమీ జరగలేదు.

"ఎందుకవ్వా అట్లా ఏడుస్తావు? ఎక్కడికి పోవాలి? టికెట్ తీసుకోకుండా ఎందుకు రైలెక్కినావు?" మెల్లగానే అడిగాడు అతను.

"కర్నూలు కెళ్ళాల బాబూ! మా చిన్నోడు మేస్త్రి పని నేర్చుకోను బోయి ఆడ రోగాన బడినాడంట ఆస్పత్రిలో ఉన్నాడని ఎవరో జెప్పిరి. అర్జెంటుగా బోతేగానీ పేనాలతో జూస్తానో లేదో!"

ఏడుస్తూనే చెబుతోంది అవ్వ

"నా దగ్గరేమో పైసలేవు. ఎక్కడినించొస్తాయి? నేనేం పని చేయగల్నని సంపాయిచ్చేదానికి? పొద్దుట్నుంచి ఎంతమంది కాళ్ళు బట్టుకుని అడిగినానో, నా సంగతంతా చెప్పుకుని. ఒక రూపాయి దొరికింది. టిక్కెట్టు కొనబోతే పద్నాలుగు రూపాయల చిల్లర ఇయ్యమన్నారు. నా కాడ అంత డబ్బేది?"

"అందుకని టికెట్ కొనకుండానే రైలెక్కేసినావా?"

"కోపగించద్దయ్యా! నాకు దెల్సు. టికెట్టు లేకుండా రైలెక్కితే తప్పనీ, పట్టుకొని జైల్లో బడేస్తారని ఏం జేస్తు నయ్యా, కడుపుతీపి, పిల్లడికి రోగం అని తెల్సినప్పటించీ పానం కొట్టుకుంటుంది. ఏమన్నగానీ దేవుడే ఉండాడని ఎక్కేసినా."

ముసలమ్మ కథ చెపుతున్నది టి సి కి మాత్రమే! అతను ఏమనుకున్నాడో ఏమోగానీ చుట్టూ మిగతా ప్రయాణీకుల మనసుల్ని కదిలించి వేసింది అవ్వ కథ. "పాపం!" అనిపించింది.

అటు టి. సి కి కుడివయిపున కూర్చొని ఉన్న ఖద్దర్ బట్టల పెద్దమనిషి, "పోనీ వదిలేయండి సార్! పాపం దిక్కులేని ముసలమ్మ; రోగాన బడ్డ కొడుకును చూడ బోతున్నానంటోంది!" అని సలహా ఇచ్చాడు.






# టికెట్‌లెస్ ట్రావెల్

టి. సి ఈ మాటలు చెవిని వేసు కున్నట్లు కనిపించలేదు

"నీ కష్టం నీది. తప్పని తెలిసినా, తప్పనిసరి అయి రైలెక్కినానంటావు. కానీ నా డ్యూటీ నేను చెయ్యాలిగదవ్వా? పెలి గొండలో రైలు అగుతూనే దిగిపోవాలి నువ్వు"

"బాబ్బాబు, అంత పని మాత్రం చేయదయ్యా" అని వలవలా ఏడవటం మొదలు పెట్టింది అవ్వ.

అవ్వ ఏడుపు చూసి, ఎదురుగా వున్న అమ్మాయి తలికి కళ్లనీళ్లొచ్చాయి కాబోలు "ఏదో ముసలి అడుక్కుంటోంది. వొది లెయ్యండి బాబూ!" అంది బ్రతిమాలు తున్నటు గా.

"చూడండమ్మా. నా డ్యూటీ నేను చేయాలి టికెట్ లేని ప్రయాణం నేరము— అయితే అలాంటి టికెట్ లేకుండా ప్రయాణించే వారిని చూసీ వదిలెయ్యటం టి. సి. గా నేరమే అవుతుంది. నేను అట్లాంటి పని ఎప్పుడూ చేయ్యలేదు. ఇక ముందు చెయ్యను"

"అబ్బో బయల్దేరాడండీ, గొప్ప డ్యూటీ మైండెడ్ పెద్దమనిషి! ఇలాంటి వాళ్ళని దొంగతిళ్లు తినగా ఎంతమందిని చూడలేదు మా కళ్ళతో" అన్నారెవరో.

"అవునవును, అయిదు రూపాయలు చేత బెడితే, నేరుగా హైదరాబాదు దాకా పోనిస్తారు మారు మాట్లాడకుండా. ఈయ నేదో పెద్ద పోజు కొడుతున్నాడు" మెల్లగా గొణిగాడు మాసిన బట్టల గడ్డం అతను.

"ఈ గొడవంతా ఎందుకు? ఇంత మందిమి ఉన్నాం కదా? ఎవరికి తోచినంత వారు చందావేసి, ఈ అవ్వకి టికెట్ కొంటే సరి" స్టూడెంటు కుర్రాడి సలహా.

'నిజమే' అనిపించింది నాకు.

ఇంతమంది ఇన్ని మాటలు అడుతుంటే నేను ఏమీ అనకపోవటం నామర్దాగా తోచింది నాకు.

"అవును. మీరు చెప్పింది బావుంది మాస్టారూ! మీరే మొదట ఇవ్వాలి, ఎవరికి తోచినంత వారివ్వండి. అంతా కలిపి, తక్కువయ్యింది నేను ఇచ్చుకుంటాను" అన్నాను ఖద్దరుచొక్కా పెద్దమనిషితో.

# భయం

సామాన్యుడు
'స్కైలాబ్' పడుతుందంటే దడుసుకోడు.
'దివిసీమ' వరదంటే భయపడి పారిపోడు.
కాని,
'పేమెంట్స్‌డే' అంటే హడలిచస్తాడు
చేతికందిన 'జీతం' ఎటు పంచాలో తోచక

- ఇమంది రామారావు

తలో పావలా, అర్ధా, రూపాయీ ఇలా వరసగా ఎవరికి తోచింది వారు నా చేతిలో పెట్టారు నేను దొంగేమో అనుకున్న గడ్డం అతను అయిదు రూపాయలు మాసి, నలిగిన నోటు ఇచ్చాడు ఆశ్చర్యంగా చూడటం తప్ప ఏమీ చేయలేక పోయాను.

అంతాకలిపి చూస్తే, టికెట్టు డబ్బుకి పదిపైసలు ఎక్కువే ఉంది. నా జేబునుంచి తీయవలసి రానందుకు సంతోషించాను. "ఇదిగోనండి" అని టి. సి. కి అందించబోయాను.

అతను తీసుకోలేదు. "వద్దు. అలా కుదరదులెండి టికెట్ను ఖరీదుకి రెండింతలు వసూలుచేయాలి రూల్సు ప్రకారం" అన్నాడు నిర్లిప్తంగా.

"ఛ! ఏంమనిషి? రాతిగుండె కాబోలు ఇతగానిది. ఇంతమంది మనసుల్ని కదిలించిన అవ్వ ఏడుపుకి కొంచమయినా చలించలేదే!" అనుకున్నాను.

"అబ్బో, పెద్ద రూల్సు మాట్లాడు తున్నాడు. అసలు మాయ మాట్లాడకుండా చూసీ చూడనట్లు వదిలేస్తే పోయేదానికి, ఎంత రాద్ధాంతం చేస్తున్నాడు చూడండి" కారాకిళ్లీ బిగించిన, సిల్కు జుబ్బా అతను బయటికి ఉమ్మేస్తూ అన్నాడు.

ఆయన పయికి అన్నాడు. నేను మనసులో అనుకున్నాను. అంతే తేడా!

అయితే ఇప్పుడిలా అందరిదగ్గిరా వసూలు చేసిన ఈ డబ్బులేంచేసేట్టు అనిపించింది. దిక్కులు చూస్తూ కూర్చున్నాను.

పోనీ నాకెందుకు అని, "ఇదిగో అవ్వా" అని అవ్వ చేతికే అందించబోయాను.

"అయ్యో నా కెందుకు బాబూ" అని

# శిరోజములను సంరక్షించే ప్రాచీన భారతీయ సాంప్రదాయాన్ని కె.ఎమ్.పి. కొనసాగించుచున్నది.




కె.ఎమ్.పి. కొబ్బరినూనె—భారతదేశమందు అత్యధికముగ విక్రయింపబడుతున్నది, డబ్బాలలో లభ్యమగుచున్నది. కె.ఎమ్.పి. కొబ్బరినూనె నూటికి నూరుపాళ్ళు స్వచ్ఛమైన వాసన, రంగు కలిగియున్నది. మరియు, కె.ఎమ్.పి. కొబ్బరినూనెను సుదీర్ఘమైన ప్రకాశవంతమగు నున్నని పట్టువంటి ఆరోగ్యప్రదమైన జుట్టుకోసం మహిళలందరు విశ్వసిస్తున్నారు. కె.ఎమ్.పి. కొబ్బరినూనె ఆ విశ్వాసాన్ని నిలుపుతుంది కూడా!

ఇప్పుడు ప్లాస్టిక్ డబ్బాలలో లభ్యమగుచున్నది.



కె.ఎమ్.పి. ఆయిల్ ఇండస్ట్రీస్
ప్రైవేట్ లిమిటెడ్
కె.ఎమ్.పి. నగర్, కొచ్చిన్ 682 006.

FDS/KMP/1/82/TEL






బులుసు వేంకటరమణయ్య

# క్రమశిక్షణ

ఇప్పుడు చాలా విద్యాలయాల్లో క్రమశిక్షణ లోపించినట్లు అందరికీ తెలుసును. తరుచుగా — విద్యార్థులు తమ కోర్కెలు తీరడానికి సమ్మెలు చేయడం, విద్యాలయాలు మూసివెయ్యబడడం, విద్యార్థులకు భయపడి ఉపాధ్యాయులు వారికి లొంగిపోవడం జరుగుతూ ఉన్నది

పూర్వకాలంలో విద్యాలయాలు లేకపోలేదు. పై దేశాలు చాలా అనాగరక స్థితిలో ఉన్న కాలంలోనే మనదేశంలో అన్ని శాస్త్రాలలోనూ మేధావులయిన మహాపండితులు ఉండేవారు అమూల్యాలయిన శాస్త్ర గ్రంథాలు వుండేవి విద్యార్థులు ఎంతో శ్రద్ధతో తాము కోరిన విద్యలను అభ్యసించేవారు గురువులంటే భయభక్తులుండేవి అందువల్ల క్రమశిక్షణ రాహిత్యానికి ఏమాత్రమూ అవకాశమే ఉండేది కాదు

అయితే—నాగరకత అభివృద్ధి చెందుతున్న యీ కాలంలో క్రమశిక్షణ లోపించడానికి కారణం ఏమిటి? అని ఆలోచించవలసి ఉన్నది పూర్వం రాజ్యాలను పాలించే రాజులు విద్యాలయాలు స్థాపించి, అధ్యాపకులను పోషించి, విద్యార్థులకు ఉచితంగా విద్య లభించేటట్లు చూచేవారు విద్యార్థులు, తాము కోరిన విద్యలను నేర్చుకునే సౌకర్యాలు ఉండేవి ఇప్పటివలె సీట్లకోసం నానా తిప్పలూ పడే అవసరం లేకపోయేది ముఖ్యంగా అప్పటి విద్యా విధానంలో మతముల తత్వాన్ని బోధించడం కూడా తప్పక ఉండేది విద్యార్థులు వివిధ మతాలను గురించి గ్రహించి, అన్నిటి ప్రధానలక్ష్యం ఒక్కటే అని గుర్తించేవారు వివిధ మతాలవారి మధ్య అన్యోన్యత ఉండేది

నేటి విద్యా విధానంలో మత బోధనకు స్థానం లేదు. మొదట కొన్ని విద్యాలయాలలో ఉండినా క్రమంగా తొలగిపోయింది. నీతి బోధనగా స్వల్పకాలం కొన్నిచోట్ల ప్రవేశపెట్టబడినా, అది నామ మాత్రమే! దానిలో పరీక్ష ఉండదు పరీక్ష ఉన్నా మార్కులకు విలువ ఉండదు అందులో మార్కులు రాకపోయినా, పై తరగతికి వెళ్ళడానికి ఆటంకం ఉండదు అందువల్ల విద్యార్థులు ఆ విషయంపై శ్రద్ధచూపరు. క్రమశిక్షణ ఇందువల్ల లోపిస్తుంది మన పాఠశాలల్లో మత బోధకు అవకాశం కల్పించి, దానికి తక్కిన విషయాలతో సమానతను ఇచ్చి, ఆ పరీక్షలో కూడా తగిన మార్కులు వస్తేనేకాని పైది తరగతికి వెళ్ళటకు సాధ్యం కానట్లు నిబంధన వుంటే క్రమశిక్షణ తప్పక ఏర్పడుతుంది ★

## టికెట్ లెస్ ట్రావెల్

మరింత గట్టిగా రాగాలు తీస్తూ కూర్చుంది అవ్వ ఎవరికీ ఏం చేయాలో పాలుపోవటం లేదు. ఆ ముసలామెని ఓదార్చే శక్తి ఎవ్వరికీ లేదు

ఈ రాక్షసుడు ఆ ముసలమ్మను పెనుకొండలో రైల్లోంచి దింపేయుటం ఖాయం అనుకున్నాను

టయిం చూసుకున్నాను ఇంకో రెండు నిముషాల్లో వచ్చేస్తుంది స్టేషను. చివరి ప్రయత్నంగా, "ప్లీజ్ తీసుకోండి, పాపం ఎందుకు దింపుతారు ముసలామెను" అన్నాను.

ఈసారి ఏమనుకున్నాడో ఏమో, అతను మౌనంగా నేనిచ్చిన డబ్బు తీసుకుని రసీదు వ్రాశాడు. దాన్ని తీసి అవ్వ చేతికివ్వబోతుంటే నేను చెక్ చేద్దామని, "ఏదీ?" అని తీసుకున్నాను — అందులో ఇరవయి ఎనిమిది రూపాయల చిల్లరకి రసీదు వ్రాసి ఉంది.

ఆశ్చర్యంగా టి సి ముఖంలోకి చూశాను "మీరంతా కలిసి, ఇంత మంచి మనసుతో ఈ అవ్వకి సహాయపడబోతే నేను అడ్డుపడాలనిపించలేదు అలా అని నా డ్యూటీకి అన్యాయం చెయ్యలేను. తోచిన వారు తోచినంత ఇస్తే నాకు తోచింది నేనూ ఇవ్వద్దూ!" అని అతను చిరునవ్వుతో అంటూ ఉండగానే రైలు స్టేషన్లో ఆగింది

దిగి వెళ్లబోతూ "నీకేం భయంలేదు, కర్నూలు వరకు నిశ్చింతగా పో అవ్వా! ఈ రసీదు భద్రంగా దాచుకో! నీ కొడుక్కు నయం అవుతుందిలే, దిగులు పడొద్దు" అని అవ్వకు చెప్పి. మరీ వెళ్లాడు టి పి. బాలసుందరం.

కృతజ్ఞతా భావంతో, అతని కాళ్ళు పుచ్చుకోబోయిన అవ్వకు అవి అందలేదు. ఆతను గబగబా వెళ్లిపోవటంతో— "నీ అమ్మ కడుపు చల్లగా, నూరేళ్ళు సుఖంగా ఉండు బాబూ" అని గొణుగుతూ చేసిన అవ్వ ఆశీర్వాదం అయినా అతని చెవులకి అంది ఉండాలి

మిగతావారి సంగతేమోకానీ, నేను ఆశ్చర్యం నుండీ తేరుకోవడానికి చాలాసేపు పట్టింది ధర్మవరం స్టేషన్లో "కాఫీ తాగుదాం రండి సార్" అని పిలిచాడు స్టూడెంటు కుర్రాడు. కలిసి వెళ్లాము కాఫీల తాగి, కింద నిలుచుని మాట్లాడుతూ ఉండగా, టాపిక్ టి సి. వయిపు మళ్లింది

"చాలా గొప్ప మనిషి ఇలాంటి వాళ్లు నూటికొక్కరున్నా మనదేశం బాగుపడేది సార్! ఇలాంటి వాళ్లని చూసి రోజుకు వందలు, వేలూ లంచాలు మింగే పెద్ద పెద్ద ఆఫీసర్లు ఎంతయినా నేర్చుకోవాలండి" అన్నాడు

గుమ్మడికాయల దొంగలాగా పాంటు జేబు తడిమి చూసుకున్నాను. అందులోనే ఉంది వెంకట్రామయ్య ఇచ్చిన తెల్లకవరు. ★

# వంటలు

## ఎగ్ పరోటా

వస్తువులు:తాజా తెల్ల గోధుమ పిండి — 250 గ్రా., ఎగ్స్ (గుడ్లు ) — 2, వుల్లిపాయలు — 4, కొత్తిమీర–50 గ్రాములు, బేకింగ్ పౌడరు — పావు టీ స్పూను, కరిగిన నెయ్యి — 2 టేబుల్ స్పూన్సు

చేయు విధము : ముందు ఎగ్స్ నురుగు వచ్చేటట్లు చిలక్కొట్టాలి. గోధుమ పిండిలో బేకింగు పౌడరు, వుప్పు వేసి బాగా కలిపి తర్వాత కొట్టిన ఎగ్స్, 2 టేబుల్ స్పూన్స్ నెయ్యి కూడా వేసి కలిపి నీళ్ళు చిలకరిస్తూ రొట్టెలపిండిలా కలిపి పెట్టుకోవాలి. కనీసం రెండు మూడు గంటలు నాననివ్వాలి. వుల్లి చక్రాలు తరిగి పెట్టుకోవాలి. కొత్తిమీర సన్నగా తరగాలి. పరోటాలు చేసే ముందు పిండిని పది నిముషాలు మర్దించాలి. మన క్కావలన సైజు వుండ తీసుకొని రొట్టె వత్తి దానిమీద నెయ్యి రాసి నాలు మడతలు చేసి మళ్లీ మళ్లీ పరోటా వత్తి పెనంమీద నెయ్యివేసి రెండు వైపులా ఎర్రగా కాల్చాలి. దీనిని ఒక పళ్లెంలోకి తీసి దానిమీద తరిగిన కొత్తిమీర జల్లి వుల్లి, చక్రాలు సర్దాలి. ఇవి వేడిగా తింటే రుచిగా వుంటాయి.

— యం. పి. రాణి

## మైదా లడ్డూ

కావలసిన వస్తువులు : — మైదా పావు కేజీ, పంచదార పావుకేజీ, యాలకులు, జీడిపప్పు, కిస్‌మిస్, మిఠాయిరంగు.

చేయుపద్ధతి : — మైదాని శుభ్రంగా జల్లించి, కొద్దిగా డాల్డావేసి పూరీల పిండి లాగా కలుపుకొని, రెండుగంటలు నాననివ్వాలి. తర్వాత వాటిని పూరీల్లా వత్తుకొని డాల్డాలో ఎర్రగా వేయించి, చల్లారాక మెత్తగా పొడి చేసుకోవాలి. అంటే రోట్లోవేసి దంచు కోవాలి. వేరే గిన్నెలో పంచదారవేసి పాకం పట్టుకొని, అందులో వేయించిన జీడిపప్పు, కిస్‌మిస్, యాలకుపొడి, మిఠాయిరంగు వేసి, దంచినపొడివేసి బాగాకలిపి కిందికి దింపుకొని, ఉండలు మనకి కావలసిన సైజులో చేసుకో వాలి. ఇవి వారంరోజులు నిలవ ఉంటాయి.

— పి. వరలక్ష్మి

# హైదరాబాద్ నోట్‌బుక్

తిరుమల రామచంద్ర

## సత్యభామ కళాకృష్ణ :

"చక్కని దానసంచు, ఎలజవ్వనినంచు, జగంబులోన పేరెక్కిన దానసంచు, పతి యెంతయు దానను రక్తుడంచు" నిక్కిన సత్య భావ హృదయం తెలిసిన వారు సాంస్కృతిక శాఖ డైరెక్టర్ డాక్టర్ అప్పారావు అన్నట్టు తెలుగునాట ముగ్గురే ఉన్నారు. పారిజాతాపహరణ కర్త ముక్కు తిమ్మన, సిద్ధేంద్ర యోగి, ప్రస్తుతం డాక్టర్ నటరాజ రామకృష్ణ. రాష్ట్ర ప్రభుత్వాస్థాన నాట్యాచార్యులు, భరత కళాప్రపూర్ణులు అయిన డాక్టర్ నటరాజ రామకృష్ణ ఎందరో నృత్యాంతేవాసులను మహానర్తకులుగా తీర్చి దిద్దారు ఆయన సరికొత్త శిష్యుడు శ్రీ కళాకృష్ణ. సత్యభామ రాజసం నిండి తొణికిసలాడే వీరవనిత సత్రాజిత్తు కూతురు అన్నిటా మిన్ననే ఆత్మాభిమానం పొంగి పొరలే రాచబిడ్డ. నరకాసురుని వధించిన వీరనారి. అలాటి పాత్రకు తగిన వ్యక్తిత్వంగల కళాకారుని ఎన్నుకున్నారు డాక్టర్ నటరాజరామకృష్ణ. కళాకృష్ణ విజయనగరశిల్పాల లాంటి సింహసంహనుడు. పచ్చని దేహచ్ఛాయ, ఐదడుగుల తొమ్మిదంగుళాల నిలువు, చక్కని కనుముక్కు తీరు— నర్తకునికి కావలసిన లక్షణాలన్నీ మూర్తీభవించిన ముద్దు గుమ్మడు. అదృష్టవశాత్తు నటరాజుచేతిలో పడ్డాడు. మహానర్తకుడయ్యాడు. అందునా సత్యభామే దివి నుంచి దిగివస్తే, నీవా, నేనా అనే ధీమాతో నర్తించగల వాడయ్యాడు ఈ సత్యభామ విరహావేదనను, ఆవేదనను, నివేదనను సెప్టెంబరు 16 వ తేదీ సాయంకాలం రవీంద్ర భారతిలో ప్రేక్షకులు చూచి బొమ్మలైపోయారు తన్మయతతో. భామాకలాపం ప్రస్తుతం తెలుగు నాట మూడు సంప్రదాయాలలో వుంది. కూచిపూడి, శ్రీకాకుళం, విజయనగరం ప్రాంతాల ధ్రువపదం, తూర్పు గోదావరి ప్రాంతంలోని నవజనార్దనం. మరొక సంప్రదాయం రాయలసీమలో ఉండేది అది నేడు లుప్తమైంది. 16 వ తేదీన ప్రేక్షకులను తన్మయులను చేసిన సంప్రదాయం నవజనార్దనం. తొమ్మిది రాత్రులు వరుసగా ప్రదర్శించి పదవనాడు భాగవత దశమస్కంధ పారాయణం చేయడం వల్ల దీనికి నవజానార్దనమని పేరు వచ్చిందని డాక్టరు నటరాజ రామకృష్ణ తెలిపారు. ఈ కలాపం వైష్ణవ దేవాలయాలలో ముఖ్యంగా పిఠాపురంలోని కుంతీ మాధవ మందిరంలో ప్రదర్శించే వారు. ఇది నాలుగు శతాబ్దాల క్రితం పేడీల నాగమ్మ, పెండేల గంగమ్మ అనే నర్తకీమణులతో ప్రారంభమైంది. ఈ సంప్రదాయంలోచివరి నర్తకీమణి పెండేల సత్యభామ ఆమె వద్ద డాక్టర్ నటరాజ రామకృష్ణ ఈ కలాపాన్ని అభ్యసించి శిష్యప్రశిష్యులను సృష్టిస్తున్నారు. నవజనార్దనం ఏవో కొన్ని దరువులు మినహా కూచిపూడి భామా కలాపానికి పూర్తిగా భిన్నమైంది. దీనిలో 150 దరువులున్నాయి వీటికి మొదట్లో కందాలు, కందార్థాలు, సీసాలు, సీసార్థాలు, ద్విపదలు, ద్విపదార్థాలు, అర్ధచంద్రికలు, ఏలలు, ధవళాలు, జోలలు, త్రిపుటలు, వెన్నె పదాలు వంటి దేశచ్ఛందాలు 150 కాక సంస్కృత శ్లోకాలు వుంటాయి. పాటలలో నవగ్రహ నర్తనాలు, అష్టదిక్పాలక నర్తనాలు మున్నగునవి వుంటాయి. రాగాలు కర్నాటక సంగీతంవే అయినా, దేశీ సంప్రదాయంతో ఆలపిస్తారు. తాళాలు దేశీ పద్ధతిలో వుంటాయి. ఏబది శబ్దాలు వుంటాయి ఈనృత్యనాటికలో వీటిని సలాంజతులనీ అంటారు. 150 దరువులలో చాల క్లిష్టమైన ఇరవై దరువులను నాయక దరువు అంటారు అరితేరిన వారే ఈ దరువులను సమర్థంగా ప్రదర్శించగలరు. ఈ కలాపంలో అష్టవిధ నాయికలూ, విప్రలంభ శృంగార కరుణరసాలు ప్రధానంగా నవరసాలు, దశ విధావస్థలు, సకల చారిభావాలు ప్రదర్శిస్తారు. వీటన్నిటిలో సత్యభామ బహువిధ విజ్ఞానం, రాజసం ప్రస్ఫుట మవుతాయి. ఈ కలాపంలో కృష్ణుడు కనిపించడు. సత్యభామ ఒక్కతే రంగం మీద కనిపిస్తుంది. ఈ విరహానికి కారణం చాలా చిన్నది. ఒకనాడు పడకటింటి ముచ్చట్లో అందంలో ఎవరు గొప్ప? — నీవా? నేనా ? — అని కృష్ణుడడుగగా, సత్య తానే నంటుంది. దానితో కృష్ణుడు కోపించి వెళ్లిపోతాడు. తర్వాత సత్య విరహావేదన నడుస్తుంది. చివరకు తన చెలికత్తె మాధవిని పంపుతుంది లేఖతో. కృష్ణుని వేణురవం వినికిడితో సత్య విరహం శమిస్తుంది. కళాకృష్ణ సిగ్గాయనో యమ్మా— అనే దరువులో ఒగ్గను స్త్రీలు కూడ సిగ్గుపడేట్టుగా అభినయించారు. ఎంతో రాజసమే ఈగొల్ల వానికి— అనే దరువులో సత్యభామ రాజసాన్ని, అభిజాత్యాన్ని కళాకృష్ణ గొప్పగా చూపారు అల్లల్ల వాడు హరి ఏమో— దరువులో కుతూహల మిశ్రిత వేదన, తన రాజసం ఎక్కడ దెబ్బ తింటుందో నసే జంకు మొదలయిన సంచారి భావాలను అత్యద్భుతంగా చూపారు. కళాకృష్ణ నా దృష్టిలో నర్తకీమణులు ఇద్దరు తప్పితే కళాకృష్ణను సత్యభామ పాత్రలో మించేవారుండరు. ప్రదర్శనానంతరం డాక్టర్ నటరాజ రామకృష్ణను అభినందిస్తూ "మిమ్మల్ని మించిపోయాడు మీ శిష్యుడు"— అన్నాను "ప్రతి గురువూ కోరేది అదేగదా!" — అన్నారు ఆనందంతో ఆయన. కళాకృష్ణ, కూడా తమ అపూర్వగాత్రంతో దరువులు పాడిన పిమ్మారి రమాదేవిని ప్రత్యేకంగా ప్రశంసించారు మృదంగం — శ్రీ బలరాం. వయొలిన్— కుమారి ఎర్రాణాక్షి. వేణువు— శ్రీ లక్ష్మణాచారి మురళి— శ్రీ నాగేశ్వరరావు. సితార్ — శ్రీ మురుసూదన్ సింథసైజర్— శ్రీ భాగ్య రెడ్డి హార్మోనియం — శ్రీ ఈశ్వర్ వీరందరినీ శ్రీ కోకా రాఘవరావు పరిచయం చేశారు. సాంస్కృతిక శాఖ డైరెక్టర్ డాక్టర్ పి ఎస్. ఆర్. అప్పారావు శ్రీ కళాకృష్ణను అభినందించారు. ఈ సందర్భంలో పెండేల కళాకారులలో ప్రస్తుతం ఆ సంప్రదాయాన్ని కాపాడుతున్న భక్తి సంగీత ప్రచారక శ్రీ కడలి అప్పారావు (కాకినాడ) ను కాశ్మీర శాలువతోను, పట్టు వస్త్రాలతోన సన్మానించారు. ఈ ప్రదర్శనాన్ని పేరిణి ఇంటర్నేషనల్ ఏర్పాటు చేసింది.



"ఎంతో రాజసమే ఈగొల్లవానికి !
అనే భంగిమలో కళాకృష్ణ

## సంచలనం కలిగించిన ఐ ఎ ఎస్ అధికారి !

రాజకీయ నాయకులు స్వప్రయోజనాలకోసం ఆరు కోట్ల ఆంధ్రుల గౌరవాన్ని కళంకితం చేస్తున్నారని, ఆ కళంకం నుంచి ప్రజలను రక్షించడానికి తమ సంఘంలోని కొందరు పదవులను పరిత్యజించి ప్రజోద్యమాన్ని ప్రారంభించడానికి వెనుదీయబోమని ప్రభుత్వోద్యోగుల సంఘం గౌరవాధ్యక్షుడు, హైదరాబాద్ నగర పాలక సంస్థ ప్రత్యేకాధికారి శ్రీ ఎ వి ఎస్. రెడ్డి (ఐ ఎ ఎస్ ) సెప్టెంబర్ 15 వ తేదీన వ్యాఖ్యానించడంతో రాష్ట్రంలో కొంత సంచలనం కలిగింది "భారతదేశం" అనే పేరుతో త్వరలో ఉద్యమాన్ని కూడా ప్రారంభిస్తామని ఆయన తెలిపారు ఈ ఉద్యమం ఏ రూపంలో వుండాలో నిర్ణయించడానికి త్వరలో ఒక సదస్సును ఏర్పాటు చేస్తామని, దీని లక్ష్యం రాజకీయ ...

శనమని, దీనిలో రాజ్యాంగ నిపుణులు, విద్యాధికులు, వివిధ ప్రభుత్వ శాఖల ఉద్యోగులు, సుప్రసిద్ధ రాజకీయ నాయకులు, మేధావులు పాల్గొంటారని శ్రీ రెడ్డి తెలిపారు. విద్యాధికులు, ఉద్యోగులు, సామాన్య ప్రజలు ఒక్కటయితే తప్ప రాజకీయ నాయకులను సక్రమమైన మార్గంలో నడిపించడం సాధ్యం కాదని ఆయన అన్నారు. తన ఆస్తిపాస్తుల విషయమై దర్యాప్తు చేయాలని ఇందిరా యువజన కాంగ్రెస్ నాయకుడు శ్రీ హనుమంతరావు చేసిన సవాలును ఎదుర్కొనడానికి సిద్ధంగా ఉన్నానని శ్రీ రెడ్డి అన్నారు.

**మధుజ్వాల ఆవిష్కరణ :**

నవ కవయిత్రి శ్రీమతి జ్యోతిరాణి రచించిన మధుజ్వాల అనే ఖండ కవితా సంపుటిని ఆగస్టు 23 వ తేదీన అశోక్‌నగర్ నగర కేంద్ర గ్రంథాలయంలో ఆవిష్కరించారు. తాను కేవలం వరి, చెరుకు పండించే రైతునని, పరిస్థితుల వల్ల ఏర్పడిన బాధ్యతలతో మంత్రి అయ్యాననీ, తనకు సాహిత్యంతో సంబంధం ఏమీ లేదని అంటూనే శ్రీ రామకృష్ణంరాజు సాహిత్యంలోని లోతులను ఎన్నిటినో తెలిపారు. ఏ పనికైనా నిజాయితీ అవసరం. నిజయితీతో వుంటే, భగవంతుడు కూడా దయగా చూస్తాడు. న్యాయంకోసం వెళ్తే అందరి సహకారమూ వుంటుంది సముద్రం కూడా దారి ఇస్తుంది. రచయిత తాను అనుకున్న భావాలను చిత్తశుద్ధితో వ్రాస్తే ఎవరైనా ప్రశంసిస్తారు. ప్రతి రచనకూ సామాజిక ప్రయోజనం అవసరం. మంచి వుద్దేశాలను మనం సమాజంలో ప్రచారం చేయాలి. దాడిచేస్తే విపరీత పరిస్థితి ఏర్పడుతుంది. కవీ, రచయితా ఎన్నిక కానటువంటి విధాన సభ సభ్యుడు కనుక వ్యతిరేక ప్రచారం చేయరాదు. లోక కల్యాణం కోసం కృషి చేయాలి— అని ఆయన అన్నారు. అధ్యక్షత వహించిన డాక్టర్ దాశరథి ప్రారంభకులు. మాజీ పోలీసు డైరెక్టర్ జనరల్ శ్రీ ఎం. వి. నారాయణరావు, కావ్య పరిచయు చేసిన ఆచార్య తిరుమల శ్రీమతి జ్యోతిరాణి కవితలను ప్రశంసించారు. ప్రారంభంలో శ్రీ మద్దాళి రఘురాం స్వాగతం చెప్పారు ఈ ఆవిష్కరణోత్సవాన్ని కిన్నెర ఆర్ట్ థియేటర్ ఏర్పాటు చేసింది ఉత్సవానంతరం నేను మంత్రి శ్రీ రామ కృష్ణంరాజు గారితో "ఏమీ తెలీదంటూనే సాహిత్య శాస్త్ర మర్మాలు తెలిపారు మీరు" — అన్నాను ఆయన వినయంగా ఒక మందహాసం చేశారు.

**ఉ ప శ్రు తి :**

ఏమండీ, మీరు ఎంతో కాలంగా ప్రెస్‌పోటోగ్రాఫరుగా వుంటున్నారు. ఎందరో పెద్దలతో సంబంధం వుంది మీకు. మరి ఏదైనా మంచి పదవి సంపాదించలేక పోయారా ? — అనడిగాను జయా స్టుడియోస్ యజమాని శ్రీ కీర్తి లక్ష్మన్ గారిని. బాగా అడిగారు పెరుమాళ్ళకైనా పెట్టు చుట్టం అనే సామెత తెలీదా మీకు? — అని ఎదురు ప్రశ్న వేశారు ఆయన

డబ్బును అదా చేసుకొందామని ఇంట్లో బట్టలుతికి నడుం విరగగొట్టుకొంటున్నారా అయితే!

# యూని-వాష్ గురించి తక్షణమే ఆలోచించండి



## మీ ఊహలకు అతీతమైన ఆదా* కలదని నిరూపించుకొన్న ఏకైక వాషింగ్ మెషిన్

**1. ఆశ్చర్యం కలిగించే పొదుపు:**
మీలాగే ప్రతి గృహిణి ఇంట్లో బట్టలు ఉతుక్కుంటే డబ్బును ఆదాచేసుకొన వచ్చని అభిప్రాయపడుతుంది. కాని యూనివాష్ వలన ఆదాచేసుకొనే దాంట్లో ఇదిసగంమాత్రమే. డిటర్జెంట్ వాడకంలోనే మీకు ఈఆదా కన్పింప చేస్తుంది.

**2. సాటిలేని సామర్థ్యం:**
భారతదేశంలో యూనివాష్‌ను మించిన వాషింగ్ మెషీన్ తయారుకాలేదు అనడంలో అతిశయోక్తిలేదు. ఉదాహరణకు 'నిర్మల్' మోడల్‌ను తీసుకొనండి. ఇదొక్కటె ఉతకటం, పిండడం, సెంట్రీఫ్యూగల్‌ద్వారా అరబెట్టడం అన్నిపనులను 12 ని॥లలో పూర్తిచేయును.

**3. అపురూపమైన పనితనం:**
యూనివాష్ ఉతకలేని బట్టలంటూ లేవు. ఉన్ని, సిల్కు, సింథటిక్స్, బ్లెండ్స్, కాటన్‌లలో ఏదైనాసరే నిమిషాలలో మురికిని పోగొట్టి సెంట్రీఫ్యూగల్‌ద్వారా అరబెట్టును.

**4. చూడముచ్చటైన ఆకారం:**
ఉత్తమ అభిరుచులుగలవారి గురించి తయారుచేయబడిన యూనివాష్, ఫైబర్‌గ్లాస్‌తో తయారుచేయబడి ముచ్చటగొలుపుతూ, మీదుస్తుల బటన్స్ పోకుండా, విరుగకుండా జాగ్రత్తతో కాపాడును. దీనివలనకూడా మీకు ఎంతోపొదుపు.

**5. ఎంపికకు ఎన్నో రకాలు:**
ఒక్క 'నిర్మల్' మాత్రమే కాకుండా తక్కువధరలో ఒట్టి వాషింగ్, రిన్సింగ్, యూనిట్లుఉన్న 'ధవళ' మరియు ఒట్టి సెంట్రీఫ్యూగల్ ద్వారా ఆరబెట్టడానికి "నిర్జల్" మోడల్స్ వున్నాయి. ఇవన్ని ఫైబర్‌గ్లాస్‌తో తయారుచేయబడి సరసమైన ధరలలో లభించును.




1 సంవత్సరము గ్యారంటీ
అమ్మకంతర్వాత నైపుణ్యమైన సర్వీస్.

| మీరు ఒప్పుకోవలసిన నిజం | | | |
|---|---|---|---|
| బట్టలు | డ్రైక్లీనింగ్* | ఇంటి* ఉతుకు | యూని* వాష్ |
| ఒకషర్టు | 1-00 | 0-45 | 0-35 |
| ఒక చీర | 1-75 | 0-80 | 0-55 |
| డబుల్ బెడ్‌షీట్ | 2-00 | 1-30 | 0-85 |

# యూని-వాష్ వాషింగ్ మెషీన్

ఇంట్లో సుఖంగా ఉతుక్కొనడానికి ఎల్లప్పుడు అన్ని విషయములలోను

* ఈఖర్చు స్టాండర్డ్ డిటర్జెంట్స్ వాడుకనుబట్టి ఇస్త్రీఖర్చు చేర్చలేదు

associated/UA/237/T

గేయాలు పంపేవారు వాటితో తపాలా కార్డు జత పరచవలసి వుంటుంది. గేయాలు త్రిప్పి పంపబడవు. గేయాలు, కవితలు సాధ్యమైనంత క్లుప్తంగా వుండటం మంచిది. —సం.







# ఉత్తరాలు

(4 వ పేజీ తరువాయి)

**శుభాకాంక్షలు !**

వినాయకచవితి పండుగ పుట్టిన రోజుగా గలిగిన ఆంధ్రుల అభిమాన ఆంధ్ర సచిత్ర వారపత్రిక ఈనాటికి డెబ్బది అయిదవ సంవత్సరం లోనికి ప్రవేశిస్తున్న సందర్భంగా నా శుభాకాంక్షలు

శ్రీవాస్ ఆచార్య ఎస్. కె. (పాలకొల్లు)

* * *

ఆంధ్ర సచిత్ర వారపత్రిక డెబ్బయి ఐదవ జన్మదినోత్సవ సందర్భంలో మా శుభాకాంక్షలు అందజేస్తున్నాము.

కొండపలస శ్రీనివాసరావు, ఇతరులు (టెక్కలి)

* * *

ఆంధ్ర సచిత్ర వారపత్రిక ది 3.9.82 వినాయక చవితి ప్రత్యేక సంచికలో హాస్యం నిమిత్తం వినాయకుని ఒక హాస్య పాత్రగా కార్టూనులు ప్రకటించియున్నారు. మీరే కాదు ఇతర పత్రికలుకూడా ప్రచురిస్తున్నారు.

హిందువులు దేవునిగా భావించి, పూజించే వినాయకుని ఈ విధంగా హాస్యరసపు కార్టూన్సలో ప్రచురించటం ఎంతమటుకు సమంజసం? ఆ విషయం ఆలోచన చేయవలసిందిగా కోరుతున్నాను. హాస్య రచనలకు, హాస్యపు కార్టూన్లకు హిందూమతం యొక్క దేవుడే కావలసి వచ్చాడా చెప్పండి?

హిందూమతపు దేవుళ్లను హాస్య రచనలు కార్టూనులతో అవమానిస్తున్నారే గాని ఇతర మతముల దైవములనుగూర్చి వ్రాయకల్గుతున్నారా చెప్పండి? ఈ విషయమును పరిశీలించవలసిందిగా కోరుతున్నాను.

ఏ. డి. మోహన్‌రావు, ఎ/122 తూర్పు కాలని
(శ్రీశైలం డామ్—518102)

**విజ్ఞప్తి**

25—6—82 ఆంధ్ర సచిత్రవారపత్రిక ఉత్తరాల శీర్షికలో "విజ్ఞప్తి" అని చివరి ఉత్తరం చదివి 0.50 పై. తపాలబిళ్లలు పంపించాను. ఇంతవరకూ ఆ అసోసియేషన్‌వారు ఎస్. టి. ఆర్. ఫ్యాన్స్ అసోసియేషన్ డైరీని నాకు పంపించలేదు.

ఎం. నాగేశ్వరరావు (బైపల్లి)






**Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna.**

